సం॥ర చందా రు 1-0-0(పోస్టేజితోసహా) Reg. No. M. 3766

సంపుటము 32 సంచిక 9

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

**డిశెంబరు 1943**

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు.

శ్రీయుత ఈదర వెంకయ్యగారు,

ప్రొప్రయిటరు:

**రామా అండ్ కో.,**

హెడ్ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్:— గుంటూరు – రాజమండ్రి.

Printed by Mr. Edara Venkaiah at his Pattabhirama Press, Ellore

# విషయసూచిక



---

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

## ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 32 | ఏలూరు, 15 డిశంబరు | సంచిక 9 |
|---|---|---|



## నిత్యసంకీర్తనము

**వివరణము :**

పసిబాలుఁడు పెద్దవారివలె గుణింపఁడు. సంకుచితబుద్ధిగలవాఁడునుగాఁడు. పిల్లల ముద్దుపల్కులఁ జెల్లింపనివా రెవరుందురు? బాలికగాని, బాలుఁడుగాని, జన్మించిన వెంటనే స్వర్గధామమునుండి యాత్మఁడేదియో మనోహరవస్తువును దెచ్చినట్లుండును. మనముగూడ వారివలెనుండునట్లు యత్నింతము. మనమేమో పెద్దవారమని గర్వించి మోయలేని భారమును దెచ్చుకొనినాము. మనమా భగవంతుని హృదయపూర్వకముగ విశ్వసించి శరణాగతులమగుచో భారములన్నియు మన తలపైనుండి తొలగిపోవును.

**సంకీర్తనము :**

1. దేవా! నా హృదయమాలిన్యమును గడిగివేయుము.
2. నిష్కల్మషభావములతో నిన్ను సమీపింతునుగాక!
3. బాలునివలె సమస్తము నీకర్పించి నీయండఁజేరి సురక్షితముగ నుందునుగాక!

—స్వామి రామతీర్థ

# భగవన్నుతి

కల్లూరు అహోబలరావు.

(వెనుకటిసంచిక తరువాయి)

సీ. జలపాతములను, దాగిలిమూతలాడు । విద్యుచ్ఛక్తిమర్మంబు లూహఁజేసి
జలగర్భమునమున్న, జంతుసంతాన । స్వైరవిహార భూరిసంభ్రమము దెలిసి
వేణుస్వరంబులో, వెలయు మాధుర్యంబు । జవిఁజూచు, గోజాతి జ్ఞాన మెఱిగి
పూరిపచ్చికలోన, క్షీరంబు నిర్మించు । భవ్యమౌ విజ్ఞానపటిమ దెలిసి,

గీ. తేటి తేనెను గ్రహియించు తెల్వి నరసి । అంబుదంబులు గుఱియువిధంబు నేర్చి
నిన్నుఁ జింతించువాఁడె సంపన్నుఁ డరయ! । భక్తమందార ! నీకిదే వందనంబు!

సీ. పిండంబు లేర్పడి పెరిగి, శిశూత్పత్తి । యౌ వింత లొక్కింత యరసి తెలిసి
జంతుజాలంబులు, స్వాభావికంబుగా । పలికెడి పలుకులభావ మెఱిఁగి
ఏడురంగులతోడ, వేడుకఁ జూపెడి । యింద్రాయుధము, పరికించి చూచి
నెమిలిపింఛమున, వన్నెలు గుల్క, నయనశృం । గారంబు సారంబుగారవించి

గీ. ప్రకృతిసౌభాగ్యలక్ష్మి సంపదల దెలిసి । సంజ కెంజాయఫక్కి, విచార మరసి
నిన్నుఁ జింతించువాఁడె సంపన్నుఁ డరయ । భక్తమందార ! నీకిదె వందనంబు.

సీ. సప్తసాగరములు, సతతంబు నీకీర్తి । స్థిరశబ్దములను, ఘోషించుచుండు
వాహినీస్వనము, నీయూహాప్రపంచంబుఁ । జాటి చెప్పుచునుండు మేటిగాఁగ
సప్తమారుతములు, శబ్దించు నెవ్వేళ । నీకీర్తిచరితంబు లోకములకు
ఊర్జితంబుగవచ్చు, నుఱుములు మెఱుపులు । నీప్రభావము దెల్పు నిశ్చలముగ

గీ. ధాత్రి నీశాంతమును జాటుతఱచుగాను । పర్వతంబులు నీస్థైర్యబలము జాటు
నిశ్చలాకార ! నిర్మల! నీరజాక్ష ! । భక్తమందార ! నీకిదె ప్రణుతిశతము .

సీ. జలనిధు లుప్పొంగి, కలిసి పైఁబడినంత । భూభాగమదియెల్ల మునుఁగకున్నె !
రవి యొక్కచోటనే పవలెల్ల నిలచిన ! కాలి భస్మముగాదె క్ష్మాతలంబు!
సప్తమారుతములు, సంక్షోభముగ వీవ । జీవసంతతులు నశింపకున్నె !
ఆకాశ మది యెల్ల, నవనిపై నొఱఁగిన । 'ఆ'యని యఱచుటకైనఁ గలదె !

గీ. కధరమల్లాడ భూతముల్ క్రుంగకున్నె! । పంచభూతంబులను స్వేచ్ఛబౌఱనీక
కళ్లెముల బిగ్గఁబట్టిన ఘనుఁడ వీవు ! । భక్తమందార ! నీకిదే వందనంబు.

# తప్పెవరిది?

(ప్రాథమికవిద్యయందు ప్రజల బాధ్యతను గుర్తింపజేయు చిన్ననాటిక)

● జి. కె. చౌదరి

మొదటిరంగము

రమణరావు, సంజీవరావు చిన్నప్పటి నుండికలిసిచదువుకుంటున్నారు. ప్రస్తుతము గుంటూరులో చదువుతూ, సెలవులలో స్వగ్రామానికివచ్చారు. ఒకనాటి సాయంకాలాన వీళ్లిద్దరూ కాలువగట్టుకేసి షికారు వచ్చారు. చిన్నప్పుడు తమతో చదివిన వెంకటసుబ్బయ్య ఆదారినేవస్తూ వీళ్లను చూచి సిగ్గుపడి ముఖంతప్పించి మరొక దారిగా పొలము వెళ్తున్నాడు. ఆలోచనలో వున్న వీళ్లు గమనించనేలేదు. దారితప్పి కాస్తదూరము పోయినాక చూచి గుర్తుపట్టి పిలిచారు. వెంకటసుబ్బయ్య పరాకున వీళ్లకేసి చూచి వెంటనే తలవంచుకొని తనకుకాదన్నట్టు వెళ్లిపోయాడు. వెంకటసుబ్బయ్య వామిలో గడ్డిలాగుతూవుండగా రమణరావు, సంజీవరావు అక్కడికే వెళ్లారు. పనిగొడవను వీళ్లువచ్చేవరకు చూడలేదు. వెంకటసుబ్బయ్య వెనుదిరిగి చూస్తే వీళ్లు—ముఖం చిట్లించి—చిన్నబుచ్చుకుంటు—తప్పనిసరిగా—

వెం.సు:-ఇట్లావచ్చారేమిటి?

రమ:-ఏం. రాకూడదా!

వెం.సు:-ఎందుకు రాకూడదూ? రావచ్చు. పనిలేకుండావస్తారాఅని.

సం:-పిలుస్తావుంటే వినిపించుకోకుండా వచ్చేశావేం?

వెం.సు:-నన్నే నాపిల్చింది? ఎవరో పిలుస్తున్నారనుకున్నాను. పనితొందరగా వుండి వచ్చాను. ఇట్లావచ్చారేమిటి?

రమ:-నిన్ను చూద్దామని.

వెం.సు:-మీరుగుంటూరునుండిఎప్పుడు వచ్చారు?

సం:-మొన్న సాయంకాలము.

వెం.సు:-గుంటూరులోవిశేషాలేమిటి?

రమ:-అన్నీ బాగానే వున్నాయి. మన ఊళ్లోవిశేషాలు?

వెం.సు:-ఈవూళ్లోవిశేషాలుఏమంతగా లేవుకాని—

రమ:-ఒకఊరువాళ్లము- చిన్నప్పుడు చదువుకున్నవాళ్లము. మాతో మాట్లాడటానికి నీకంత అనుమానమెందుకు? సిగ్గెందుకు?

సం:-(వెంకటసుబ్బయ్యనుద్దేశించి) ఇందాక ఏమిటో చెప్పబోయి 'కాని' తో ఆపినావు ఏమిటి?

వెం.సు:-ఏమీలేదు. నాకెట్లాగోఅబ్బలేదు అక్షరపుముక్క. మా రంగారావుకు బాగా చెప్పించాలనివుంది చదువు. దానికి ఉపాయమాలోచించిచెప్పుదురూ. అవసరమనుకుంటే మీవెంటే. తీసుకువెళ్లండి గుంటూరు.

రమ:-ఇప్పుడేతరగతిచదువుతున్నాడు?

వెం.సు:-మూడోతరగతి. పేరుమూడే గాని గుణింతాలన్నా! తిన్నగారావు.

సం:-మనఊళ్లోబడిబోతే ఇంకాచదువుకోవచ్చుగా?

వెం.సు:ఊళ్లో చదువు, ఊళ్లో చదువు

గానేవుంది. ఏమీచెప్పటంలేదని పెద్ద గోలగావుంది ఊరంతాను.

రమః-ఎందుకు చెప్పరు? చెప్పకుండా వుంటానికి హేతువులు కనబడవే?

వెం.సుః-ఏమో గవర్నమెంటుజీతాలు పుచ్చుకునేవాళ్లు మనకు తన్నగా చెప్తు తారా అని ఊరంతా గోలగావుంది.

సంః-ఎందుకు చక్కగా చదువుచెప్ప టంలేదో గ్రామస్థులు ఎన్నడైనా అజ కనుక్కున్నారా ?

వెం.సుః-అజా లేదు. గతీలేదు.

సంః-మరి పాఠశాలను గూర్చి వూళ్లో ఆలోచనలేమిటి ?

వెం.సుః-ఏమీ లేవు. బోర్డుస్కూల్లో ఎల్లాగో చదువురాదు. ప్రయివేటుమేష్టరును తీసుక వద్దామని వుంది కొందరికి.

రః-ఎవరికి ?

వెం.సుః-మునసబుగారి నరసయ్య తన కొడుకులిద్దరికి ప్రయివేటుపంతుల్ని తీసుక వస్తాడట. వాళ్లతోపాటు మాతమ్ముడు రంగారావును కూడా పంపుదామను కుంటున్నా.

సంః-మునసబుగారి నరసయ్య అంటే భాగ్యవంతుడాయె. ఆయనతో పాటు నీతమ్మునకు కూడా ఖర్చుపెడతారా.

వెం సుః-ఆ ! ఉన్నదంతా అమ్మివైనా సరే చదువు చెప్పించాల్సిందే.

రమః-నీవుద్దేశ్యమేనా ? మీ నాన్న వుద్దేశ్యంకూడానా ?

వెం.సుః-చదువులేని జన్మమెందుకు ? నాకు పూర్తిగా వుంది. నేను గట్టిగా చెప్పితే ఎవరూ కాదనరు. ఖర్చుకు చూచి మీతోపాటు నన్ను గుంటూరు పంపనం దుకు అఘోరిస్తున్నా చాలదూ ?

సంః-ఎంతయినా సరే ఖర్చు పెట్టి. చదువు చెప్పించుకోవాలన్న పట్టుదల వున్నప్పుడు బోర్డుస్కూల్లో ఎందుకు సరిగా చెప్పటంలేదో కాస్త ఆలోచించారా ?

వెం.సుః-లేదు. ఆశ్రద్ధ ఎవరికీ లేదు. నావంటివాడు అంటే ఎవరూ లక్ష్యము చెయ్యరు.

రః-కాస్త ఇచ్చుకోగల మీరందరు ప్రత్యేకముగా మేష్టర్ను పెట్టుకుంటే ఇచ్చుకోలేనివాళ్లగతేమిటి ?

వెంసుః-వాళ్లగతా ? అంతే

సంః-ఉన్నవాళ్లు ప్రత్యేకంగాచెప్పించు కుంటారు. కాని లేనివాళ్లుఉ భయభ్రతా భ్రష్టత్వమెందుకని కూలినాలి చేసుకుం టారు. బడిలో తగినంతమంది విద్యార్థులు లేరని బడి ఎత్తివేస్తారు. అప్పుడు——

వెం.సుః-ఎత్తివేస్తేఎత్తివేస్తారు.

రమః-అప్పుడు బాధలపాలయ్యేదెవరు?

వెం.సుః-ఇప్పుడు ఎవరో-అపుడువాళ్ళే గ్రామస్థులు.

రః-మీరేమో కాస్త ఇచ్చుకోగల వాళ్లు కనుక మీకు కనబడటంలేదు. ఏమీ ఇచ్చుకోలేనివాళ్లమాట ?

వెం.సుః-నిజమే. వాళ్లకు కష్టమే.

సం.-ఈబడి వున్నందున వస్తున్న ఈ సామాన్యచదువు కూడ వచ్చే అవకా శాలు ఈగ్రామము మొత్తముమీదనే వుండవు. అప్పుడు ?

వెం.సుః-మరి ఏమిచెయ్యాలి అంటారు

సంః-ఉన్న ఈబడివల్ల ఏదోవిధముగా అక్షరపుముక్క వచ్చే ఏర్పాటు చేసు కోవాలి. కష్టపడి చెప్పే పంతులు కాదను కున్నప్పుడు, బదిలీ చేయించాలి. కష్టపడి పని చేసేటట్టు ఉపాధ్యాయునికి ప్రోత్సాహ

మియ్యాలి. అటువంటి ప్రయత్నాలేమీ చెయ్యకుండా ప్రయివేటుమేష్టరువల్ల వచ్చే ఫలితము ?

వెం.సు:-గ్రామస్థులుచెప్పితేనే పంతుళ్లను బదిలీ చేస్తారా?

ర:-గ్రామస్థులు కోరితే చెయ్యక మరెవరు కోరితే చేస్తారు? ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా ప్రవర్తించడానికి సామ్రాజ్యాధిపతికి కూడా శక్తిచాలదు.

సం:-అసలు అందుకుగాను నియమింపబడిన పంతుళ్లు చదువు చెప్పడంలేదు అంటే అందు ఇంతో అంతో లోపము గ్రామస్థులదికూడా ఉండి ఉంటుంది.

వెం.సు:-మీరు అన్నట్లు గ్రామస్థుల లోపము పూర్తిగావుంది.

సం:-పాఠశాలలో చదువు బాగా చెప్పటంలేదనీ, వున్నవాళ్లముగదా అనీ, ప్రత్యేకము పంతుల్ని తీసుకరావడము గ్రామస్థులందరికి తీరని బాధ. ఈ పాఠశాల పోయిందా తిరిగి తీసుకురావడానికి ఎంతో కష్టపడాలి.

వెం.సు:-ఐతే మీరు మన ఊళ్లో ఎన్నాళ్లు ఉంటారు? ఈ విషయమై మన పెద్దవాళ్లతో కూడ సంప్రదించి కాస్త కట్టుదిట్టము చేసుకోవాలి.

సం:-అట్లానే.

రమ:-ఇంటిదగ్గర తొందరపని అంటివిగా, చాలాసేపు ఉన్నావు.

వెం.సు,-నాడు ఉండదు పని ఎప్పుడూ వుండే పనే. (అంటూ గడ్డి మోపు ఎత్తుకొనును. సంజీవరావు, రమణరావులు ముందు నడుస్తుండగా ఇంటికి వెళ్లుదురు.)

(సశేషము)

---

# చిన్నబిడ్డల చిత్తవృత్తులు

బాలకవి అన్నాప్రగడ వీరరాఘవయ్య

## శిశువుల సహజ ప్రకృతులు

సహజ ప్రకృతులు,—

భగవంతునిచే సృష్టింపబడిన ప్రతిజీవియందును, కొన్ని సహజప్రకృతు లుద్భవించును. వీనికి పారంపర్యముతో సంబంధము లేదు. కాని పరిసరప్రభావమున తగిన యభివృద్ధి నొందుటకును, వివిధములగు మార్పు జెందుట నును, నవకాశముగలదు. ప్రకృతి జనితములగునివి క్రమ క్రమముగ వృద్ధినొంది భావి జ్ఞాన సంపాదనమునకు సోపాన ప్రాయములగును. ఇవి సక్రమమగు విధానమున నడిపింపఁబడిననే తప్ప క్రమక్రమముగ క్షీణించి బిడ్డల జడత్వమునకు కారణ భూతములగును.

విద్యావిధానమున వీనిస్థానము —

విద్యావిధానమున నీసహజప్రకృతులకుఁ బ్రధాన స్థానముగలదు. ఇంటియందును, బడియందును, శిశుశిక్షణకివియే యాధారములు. ఐకమత్యము, శాస్త్రశోధన, మొదలగు విషయములలోనేగాక, చిత్రచిత్రము లగు వివిధవిషయములకు కారణములగుచున్నవి. విద్యాక్షేత్రమున నీసహజ బీజములు తగువిధమున సంస్కరింపఁబడును.

ఇట్టి సహజప్రకృతులసాయమే లేనిచో శిశువుల విద్యాబోధనమంతయు నడవిని గాచిన వెన్నెలయగును.

సహజప్రకృతుల లక్షణములు —

సాధారణముగ సహజ ప్రకృతులకు క్రియారూపమే ప్రధానము. ఇవి పూర్వానుభవమేమియు లేకుండనే జరుగును. పరిజ్ఞానమసలే యుండదని చెప్పవచ్చును. ఇవి గతానుగతికములుగ జరుగుచుండును. కాని యీస్వభావము మానవులలో కంటె జంతువులయందు విశేషముగనున్నది. కొన్ని యెడలనిది యాత్మరక్షణకు సాధనమగుచున్నది.

వీనికి మనోవికారములకును గల సంబంధము —

సహజప్రకృతులకును, మనోవికారములకును, అవినాభావసంబంధము గలదు. మనోవికారము లేక యే సహజ ప్రకృతి యుండుట యసంభవము. ప్రతి సహజ ప్రకృతియు నేదో యొక మనోవికారముతో గూడుకొనియుండును. ఎట్లన - కోపము మనోవికారము దానినుండి కలహమును సహజప్రకృతి జనించును. భయ మొక మనోవికారము. దానినుండి పలాయనమును సహజప్రకృతి జనించును.

రకములు —

సహజప్రకృతులలో ననేకరకములు గలవు. అందుముఖ్యమైన వానిని బేర్కొనుట సముచితము. విద్యానాటకరంగమున ముఖ్య పాత్రలు వహించువానినే మనముదహరించెదము. అవి యేవన (1) క్రీడ - క్రియ. (2) అనుకరణ (3) నిర్మాణము (4) సూచన (5) జిజ్ఞాస (6) కుతూహలము - మొదలగునవి. వీని యన్నింటియందును ఉపాధ్యాయునకు సమానబాధ్యత గలదు. శిశుశిక్షణమున కివియే యాధారప్రాయములని యతఁడు గుర్తెఱుగవలయును.

క్రీడ, క్రియ —

క్రీడయను సహజప్రకృతి బిడ్డలకు పసితనమునందే ప్రారంభించును. చంటిబిడ్డ సైతము తనచేతులనటునిటు త్రిప్పును. అటునిటుచూచి కొంచెమెగురును. దేనినో చూచి తనలోతాను నవ్వుకొనును. నిష్కారణముగనే భయపడినట్లు నటించి కేరుమని యేడ్చును- శైశవమందు శిశుజీవితపు తొలి పాలున ప్రవేశించిన యీక్రీడ యాతని జీవయాత్రలో వివిధపరివర్తనములతో విలసిల్లును క్రీడకును, అనుకరణకును సన్నిహితసంబంధము గలదు. సాధారణముగ కౌమారదశలో ననుకరణమునుండియే యాటజనించును మచ్చునకు పిల్లవాడు కూరగాయలవాని ననుకరించి క్రీడించును. ఇది క్రీడయేగదా. ఇదియేగాక తన భావి జీవితమున జీవయాత్రను వెళ్లబుచ్చవలసిన కొన్ని వృత్తులను క్రీడద్వారా ప్రదర్శించును క్రీడ భావప్రకటనావిధానమున కొకరహదారి కాని దీనియందుత్సాహపూర్వకమగు చురుకుదనమవసరము.

రెంటికినిగల సంబంధము భేదములు —

క్రియకును, క్రీడకును, పరస్పర సంబంధముగలదు. ఇవియొక దానికొకటి వేరుగా నుండక పరస్పరము కలసిమెలసియుండును కాని రెంటికిని ఒకటే ముఖ్యభేదము. క్రీడయందానంద పూర్వకమగు, ఐచ్ఛిక స్వేచ్ఛ యుండును. నియమితమగు నిర్బంధమిందిమిడియుండదు. బిడ్డ తన యిచ్ఛవచ్చిన రీతిని బ్రవర్తింపవచ్చును. ఇఁక క్రియయందు నియమితములగు కట్టుబాట్లతో నిర్బంధమిమిడియుండును. కాన కర్తకుదీనియందు మనస్స్వాతంత్ర్యమేగాక భౌతిక స్వాతంత్ర్యముగూడ తక్కువ. క్రమప్రవర్ధితమగు నుత్సాహమునసరించి క్రీడలు క్రియలు

గను, క్రియలు క్రీడలుగను, మారు చుండును.

ఫలితములు —

క్రీడ బిడ్డలకానందము గూర్చును. శిశువులందు స్వాభావిక ప్రేమను వృద్ధి నొందించుట క్రీడయేముఖ్యసాధనము. కిండర్ గార్టెన్ ప్రాజెక్టు, డాల్టన్ మాంటిసోరీపద్ధతు లీక్రీడాసూత్రముననుసరించియే కనిపెట్టఁబడినవి. వీనిమూలమున బిడ్డలయందుగల నిరుత్సాహమును రూపుమాపి కుతూహలమును, జిజ్ఞాసను, నభివృద్ధి నొందింపవచ్చును. ఆచరణద్వారా అభ్యసనమునకు క్రీడాపద్ధతియే ముఖ్యము. బిడ్డల ప్రత్యక్షానుభవమిందే యిమిడియుండును.

(సశేషము)

---

# శబ్దము - వేగము

పి. నరసింహము హెడ్మాష్టరు తంగుడుబిల్లి

(గతసంచిక తరువాయి)

శబ్దము కంపనమువలన గలుగుచున్నదని తెలిసికొనియుంటిమి. తంబుఱ, వీణ, అనునవితంతియలకంపనమువలన ధ్వనించుచుండుట మనము చూచుచున్నాము. ధ్వని యుత్పన్నమగునపుడొక శబ్దమునకు, మఱియొక శబ్దమునకు, గల కాలపరిమితి క్రమముగనుండిన శ్రావ్యధ్వనియు, క్రమముతప్పిన కర్కశధ్వనియు, జనించును. (కాకికూంతకర్కశధ్వని, కోయిల కూంత శ్రావ్యధ్వని) వీణాదులలో తంత్రులను బిగించి స్థాయిని (Pitch) గనిపెట్టుదురు. ఎక్కువస్థాయిగల శబ్దముజనించుటకు సెకనునకు 2000 సార్లు కంపింపవచ్చును. తక్కువ స్థాయిగల శబ్దమునకు 50 సార్లు కంపించినచాలును. శబ్దముయొక్క స్థాయి సెకనునకు 30 కంపనములకంటె, తక్కువగానుండినను, 3,80,00 కంటె ఎక్కువగా నుండినను, ఆశబ్దము మనకు వినబడదు.

శబ్దకంపనసిద్ధాంతము(Theory) నాధారముగా జేసికొని గ్రామఫోన్ (Gramophone) అనుయంత్రమును ఎడిసన్ (Edison) అను అమెరికాశాస్త్రజ్ఞుడు 1877 సంవత్సరములో కనిపెట్టెను. టెలిఫోను, టెలిగ్రాము, రేడియో అను అద్భుతకార్యములు, పై సిద్ధాంతముయొక్క రూపాంతరములే. వీని రచనమంత సులభసాధ్యము కాకపోవుటయే గాక, వ్యాసవిస్తరభీతిచే క్లుప్తముగ నిందుదహరించుచున్నాను.

Telephone:— అగ్గిపెట్టెల పైకప్పును రెంటిని తీసికొని వాని ఒకప్రక్క రంధ్రములకు కాగితము అంటించి మూయవలెను. పొడవైనదారము నొక దానిని తీసికొని దారముకొనల రెంటిని చెఱియొక డొక్కరంధ్రములగుండా చొనిపి లోనముడివేయవలెను. ఇప్పుడీ డొక్కలను గట్టిగా లాగి పట్టుకొని ఒకకొననుండు డొక్క వద్ద మాట్లాడినచో రెండవడొక్కవద్ద శబ్దము స్పష్టముగా వినబడును. ఈ శబ్దము రమా

రమి 30 గజముల దూరమువరకు విన బడును. అగ్గిపెట్టె డొక్కులకు బదులు పలుచని లోహపురేకులను, మన ఫౌన్‌టన్‌పెన్ గొట్టములవంటి వాల్కనైట్ (Vulcanite) అను పదార్థముతో చేయ బడిన డిప్పలను దారమునకుబదులు లోహ పుతీగయు,•ఉపయోగించినచో అంతకంటె నెక్కువదూరము ధ్వనిపోవును. కాని యీ పద్ధతివలన మైళ్ళకొలది దూరము ధ్వని ప్రయాణము చేయజాలదు. కావున టెలి ఫోనునందు విద్యుచ్ఛక్తి నుపయోగించు చున్నారు. దీనిని తొలుత కనిపెట్టినవాడు 'గ్రాహాము బెల్' అను అమెరికా శాస్త్రజ్ఞుడు. వీనిమూలమున ఒకేపట్టణ ములో ఒకయింటినుండి మఱియొకయింటి కిగాని, వేఱువేఱు పట్టణములకుగాని, ఖండాంతరదేశములకుగాని, ఉత్తరముల వలన కొన్నిరోజులలో తెలియగలవార్తలు కొన్నిగంటలలో తెలియజేయవచ్చును. ఇరువురు టెలిఫోనులో మాటలాడుకొనుట ఇప్పుడు మన వారిలో తెలియనివారు అరుదు.

నవీనశాస్త్రజ్ఞు లీటెలిఫోను యంత్ర ములో కొన్నిమార్పులుచేసి, దానికి చిన్న యంత్రమొక దానినిచేర్చి యింటనెవరును లేనపుడు అదిసందేశమును గ్రామఫోను రికార్డువలె వ్రాసియుంచి యింటివారు వచ్చినవెంటనే తెలియజేయునట్లు వృద్ధి జేసిరి.

**Telegram:**—మనమొక పోస్టాఫీసుకు పోయిన, అక్కడ కట్ట కడకట్ట, యను శబ్దమునువిందుము. దాని అర్థము అక్కడ పనిచేయువారికేగాని మనకు తెలియదు. ఆంగ్లభాషకు వర్ణములు 26. ఈ అక్షరము లకును, 9 అంకెలకును, సున్నకును, విరామపుగుఱుతులకును, సంజ్ఞలనేర్పఱచిరి. హ్రస్వాక్షరమునకు (.) చుక్కయు, దీర్ఘాక్షరమునకు (— డేషువంటి) గీతయు గురుతుగా వ్రాయుదురు. టెలిగ్రాఫ్ ఆఫీసునకుపోయి అక్కడి ఉద్యోగి నడిగి, ఒక టెలిగ్రాముఫారము పుచ్చుకొని దానిమీఁద వార్తలనువ్రాసి రుసుముతో వాని కాఫారము నందిచ్చినయెడల అతడు యీ సంజ్ఞలద్వారా వార్తలను బంపును. ఈ పద్ధతిని మార్సు అను శాస్త్రజ్ఞుడు కని పెట్టెను. అందుచే దీనిని మార్సు పద్ధతి (Morse code) అందురు. ఈ పద్ధతివలన నిముషమునకు 200 మొదలు 250 వఱకు మాటలను బంపవచ్చును. దీనికినివార్తలను బంపుయంత్రము (Sender), వార్తలను గ్రహించు యంత్రము (Receiver) యీ రెంటిని కలుపుతంతెలును, విద్యుచ్ఛక్తి యు, అవసరములు. టెలిఫోనుపద్ధతికంటె యీ టెలిగ్రాముపద్ధతి అబ్బురవిషయము కాదు. వేలకొలదిమైళ్ళ దూరములోనున్న వారికి సంజ్ఞలకంటె మనమాటలు విన బడుట ఆశ్చర్యమేకదా! మనమొక ట్రయి నులో ప్రయాణము సాగించితిమేని ట్రయి నుపోయిన దూరమునను స్తంభములను (Poles) పాతి, వానికి తంతులనమర్చి యున్నారు. ఈతంతులు నేలమీఁదనేగాక సముద్రములో నీటిఅడుగున నయితము పడవైచియున్నారు. సముద్రములో తంతు లనువేయు పద్ధతి కనిపెట్టినవాడు లార్డు కెల్విన్ అనునతడు. (Lord Kelvin Professor of Glasgow University)ఇప్పుడు సముద్రములన్నిటిలోను కలిపి 3లక్షలమైళ్ల దూరముతంతులు(cables)వేయబడిఉన్నవి.

విమానములో పోవువారికి భూగోళము నీ తంత్రులతో బంధించినట్లు కనబడును. ఈ తంత్రులు కొన్ని సమయములయందు తెగి పోవుటయు వార్తల కాటంకము కలుగుటయు కలదు. ఇట్లు తంత్రులమూలమున వార్తలనుబంపు పద్ధతులు రెండును విమానములో ప్రయాణముచేయువారికిని, సముద్రమధ్యమునపోవు నావలోనివారికిని, ఉపయోగకరముగ లేవు. ఇందువార్తలు ఒక్క నియమిత గమ్యస్థానమునకు మాత్రమే పోయిచేరును.

Wireless Telegram:— నవీనసైన్సు శాస్త్రజ్ఞులు (Modern Scientists) తంత్రులక్కరలేకయే వార్తలను బంపు పద్ధతిని కనిపెట్టిరి. ఈ తంతువిరహితవార్తా పద్ధతి కనిపెట్టినవారిలో ప్రథముడు (Founder) ఇటలీదేశీయుడగు మార్కోనీ (Marconi) తరువాత వృద్ధిలోనికి దెచ్చినవారు మాక్సువెల్ (Moxwell), లాడ్జి (Lodge), హర్ట్జ్ (Hertz), బ్రాన్లీ (Branly) అను పాశ్చాత్య శాస్త్రజ్ఞులును, మన భారత దేశీయుడును, వృక్షములకు హృదయమున్నదని (That plants have hearts) చూపిన సూక్ష్మగ్రాహియు నగు జగదీశ చంద్రబోసును(Jagadis Bose). ఈమహాపురుషుల పరిశోధనలవలన దీనినుత్పత్తి గావించిరి. దీనికిని విద్యుచ్ఛక్తిసహాయ మవసరము. తంత్రులు లేకుండుటచేత ధ్వని నానాదిక్కులకు బోవును. ఒక యంత్రసహాయమున హర్ట్జ్ అనుపేరుగల పెద్దధ్వని కెరటములను తయారుజేసి ఒక పొడుగైన కొయ్య (Pole) పాతి తద్వారా ఆకాశకెరటముల (Ether waves) తో వానిని కలిపి మార్సుసంజ్ఞల పద్ధతిని దీనిలోవార్తలను బంపుదురు. ఈథర్ కెరటములు ఈధ్వనిని గొనిపోయి సందేశ గ్రాహకస్థానముల కందిచ్చును. ఇట్టి ఎత్తైన స్తంభములు విశాఖపట్టణము నందును మదరాసునందును గలవు:

Radio Telephone.— శాస్త్రజ్ఞుల ప్రతిభవలన పైపద్ధతిని మఱికొన్ని మార్పులుజేసి వృద్ధిజేసిరి. రేడియో యంత్రము చిన్నపెట్టెనుబోలియుండును. దానిమీద సందేశహరస్థానములు ముద్రింపబడియుండును. హర్ట్జ్ కెరటములను పొడిగించిగాని, కురుచపఱచిగాని, సవరించుకొని మనకుకావలసిన స్థానము నుండి వార్తలను తెప్పించుకొనవచ్చును. ఇందు ఒకచోట పాడబడుపాటలును, మాటలును, ప్రపంచమందంతటను ఏక కాలమందు వినబడును. ఢిల్లీలోను మదరాసులోను జరుగు ఉపన్యాసములును, సంగీతగానమును, మనమందరము విని యానందించుచున్నాము. లండనులో శ్రీ చక్రవర్తిగారి మాటలు మనహిందువులు వినియుండలేదా? రేడియోయంత్రమును వెలఁదీయ సామాన్యకుటుంబీకునకుగూడ సాధ్యమగును. మూడు, నాలుగువందల రూప్యములకు యీయంత్రము లభింప గలదు. ఇతరదేశములలో పల్లెలయందును, కూలిచేసికొనిజీవించువారి యుండ్లయందును గూడ నీయంత్రములు గలవఁట రేడియో ప్రసంగములు—(Radio Programme) వార్తాపత్రికలమూలమున మనకు ముందుగా తెలుపుచున్నారు. ఇందొకయనర్థము గలదు. రహస్య వార్తలను బంపుకొన వీలులేదు. నానాదేశీయులును దీనికొఱకు నియమింపబడియున్న అంతర్జాతీయసంస్థ

యొక్క నియమముల ననుసరించినడుచు కొనవలెను. పాశ్చాత్య దేశములలో, నాగరకతాభివృద్ధికి ఇది ప్రబలకారణమైయున్నది. సముద్రముమీఁద నావలో ప్రయాణము చేయుచున్నప్పుడు ఏదేని ఆపద సంభవించినచో అప్పుడు తంత్రీరహితవార్త నంపి ప్రాణమును కాపాడుకొనవచ్చును. వాయువిమానములో ప్రయాణముచేయువారు సంభాషణలు సాగింపవచ్చును. ఇందు శబ్దవేగము సెకండునకు 186000 మైళ్లు. అనగా వెలుతురు కిరణములతో సమానముగా ప్రయాణము చేయగలవు. నేలమీఁదినుండిగాని, సముద్రముమీఁద నడచుచున్న నావమీఁదినుండిగాని, ఆకాశములో అతి త్వరితముగ బోవుచున్న శత్రువిమానమును ధ్వంసముచేయవలెనన్న వేగముయొక్క ప్రమాణము తెలిసియుండిననేగాని గురితప్పనుగదా? ఇప్పుడు శబ్దముయొక్క వేగము దెలిసికొనుటవలని ప్రయోజనమేమియో చదువరులు గ్రహించుదురుగాక!

---

# ఉపాధ్యాయుఁడే విద్యార్థి నాకర్షించు సూదంటురాయి

ఆనమల్ల రూబేను, లేబర్ స్కూలు, ఉడమలపర్తి, అనంతపురము జిల్లా

ఒక నాటకమును దర్శించునపుడు, ఆ నాటకమునందు ముఖ్యమైనవి మూడు గమనించనగును. ఆ మూఁడింటిలో మొదటిది, చిత్రలేఖనము, రెండవది ఉపకరణములు; మూఁడవది రాగము, ఈమూఁడు కలియుటవలన ఒక నాటకమనబడును. దీనిలో చిత్రించబడిన పరదాలు, చిత్రించిన చిత్రలేఖనియొక్క నైపుణ్యము, తెలివితేటలు, అతనిచమత్కారము, అనేకమంది బాలబాలికలు, ఆ పటములను, అత్యుత్సాహముల తోను ఆనందముతోను చూచుచుందురు. ఆ పటములో కనబడు కోటలు, మార్గములు, చెట్లు పువ్వులు, నదులు, వనములు, అడవులు, బాలురను బహువిధములనాకర్షించును.

కాబట్టి పంతుళ్లు చిత్రలేఖకులై యుండుటవలన విద్యార్థులను ఆకర్షించుటకు ముఖ్యసాధనమై యుండును. దీనికి కొన్ని దృష్టాంతరములు తెలుపుదును.

నేను చిత్రలేఖనమునందు ఎక్కువ ప్రవీణుడను కాకపోయినా, ఉపమానములు తెలుపుటకు సతూహలుడనై యున్నాను. నేను ఒక గులాబిపువ్వును చిత్రించియుండగా సమీపమునకు నీటికొరకు వచ్చి యున్న ఒక తేనెటీగ ఆశతో వచ్చి ఆపుష్పము మీఁద వ్రాలి యెక్కువ నిరాశ చెంది చింతతో వెళ్లినది. ఆ తేనెటీగను మోసము చేసితినే అని నేను చింతపడితిని. మరియొకదినము, ఒకకుక్కను చిత్రించి దాని ఆకారమును కత్తిరించి పువ్వుల చెట్లయొద్ద క్రింద పెట్టియుండగా ఒకకుక్క పరుగెత్తుచు వచ్చి మొరుగుచు దానిని సమీపించి, వాసనచూచి, తనకోపమును చల్లార్చుకొని వెడలిపోయెను.

ఈ విధముగా చిత్రలేఖనము ద్వారా జంతువులను, కీటకములను, ఆకర్షించునపుడు, మనుష్యమాత్రులైన బాలబాలికలను ఆకర్షించుట అసాధ్యమా? యోచింపుడు.

ఉపాధ్యాయుడు కథలపటములను, ఇతరపటములను, చిత్రించి పాఠశాలయందుంచుటవలన అనేకమంది బాలబాలికలను విద్యాభివృద్ధికి పాఠశాలకు వచ్చునట్లు ఆకర్షించినవాడగును. అందలి విషయములను కూడ బాలబాలికలుగ్రహించి జ్ఞాపకము చేసుకొందురు. చిన్నచిన్న పటములు చిత్రించి వాటిపేర్లను కూడ వ్రాయుట, చదువుట నేర్పించనగును. ఒకబొమ్మను నల్లబల్లపైవ్రాసి బొమ్మవిషయమును క్లుప్తముగ బొమ్మక్రింద వ్రాసిన, బాలుర మనసునందు అది చక్కగా నాటుకొనును.

అనేకమంది ఉపాధ్యాయులకు చిత్రలేఖనమనిన తలనొప్పిగా ఉండును. అటువంటి ఉపాధ్యాయులను చూచిన బాలురకు కూడ తలనొప్పిగానే యుండును. కాబట్టి ప్రతిఉపాధ్యాయుడు చిత్రలేఖకుడైయుండి విద్యాభివృద్ధికి తోడ్పడువాడైయుండుటకు ప్రయత్నింపగలడని నావిశ్వాసము.

కొన్ని పటములు, ఒకటి రెండు తరగతులకు సిలబస్సు ననుసరించి కథలు, సులభపద్ధతిలో చిత్రించుపద్ధతి, కనిపెట్టి కథలపటములను వ్రాయుచున్నాను. మాదిరి పటము రాబోవు పత్రికయందు చిత్రించి చూపి తరువాత కొన్ని పటములు తయారు చేసి పై అధికారుల అనుమతిపొంది తెలుపుకొందును.

---

# ఆసియాఖండము - ముఖ్యవిషయములు.

వేదుల నరసింహము

(గతసంచిక తరువాయి.)

పాలనీషియనులు:—పసిఫిక్ మహా సముద్రములోని దీవులకు పాలనీషియా దీవులని పేరు. ఇచ్చట నివసించువారికి పాలనీషియనులని పేరు. వీరుపొడగరులు; పసుపు పచ్చని శరీరముగలవారు; చిరునగవు ముఖములతోనుందురు. వీరికొక పెత్తనదారుడుండును. వీరికిమతగ్రంథములు లేవు. కాని వీరు ఆచారమునకు భిన్నముగ ప్రవర్తింపరు. వీరికి దయ్యములు, భూతములందు నమ్మకముగలదు. పువ్వులహారములు ధరింతురు. వేటయందు ప్రీతిఎక్కువ. వీరు మాంసాహారులు.

## ఆసియా - ముఖ్యపట్టణములు.

| దేశములు | |
|---|---|
| 1. బర్మా | 1. రంగూన్:—ఐరావతీనదీ ముఖద్వారమునగలదు. ఇచ్చట నుండి టేకు, బియ్యము ఎగుమతి అగును. ఇచ్చట కలప కోయు యంత్రశాలలు గలవు. |
| | 2. మోల్మేను:—ఇచ్చటనుండికూడ కలపఎగుమతిఅగును, |

2. చైనాదేశము (ఉత్తరభాగము)

3. షాంటంగ్:—ఇది ఉత్తరచైనాలోని పట్టణము. ఓకు చెట్లు ఎక్కువగ గలవు. ఇచ్చట పట్టుపరిశ్రమ ప్రధాన వృత్తి.

4. పెకింగు:—ఇది చైనాదేశపు పూర్వపు రాజధాని. ఇచ్చట శత్రుబాధ అధికముగనుండుటచేత ఇపుడు రాజధానినగరము "నాన్‌కింగు" నకు మార్చబడెను.

(మధ్యభాగము)

5. షాంగ్‌హై:—యాంగ్‌ట్సెకియాంగ్ నదీముఖద్వారమునున్న రేవుపట్టణము. ఇచ్చట ఇంగ్లీషు, ఫ్రెంచి, అమెరికనులు, నివసించుటకు ప్రత్యేక నివేశనములుగలవు.

6. హాన్‌కౌ:—చైనాదేశములో కెల్ల రెండవ గొప్పపట్టణము.

7. నాన్‌కింగు:—చైనాదేశపు ప్రస్తుత రాజధానినగరము;

(దక్షిణభాగము)

8. కాంటన్:—దక్షిణచైనాకు ముఖ్యపట్టణము.

9. హాంకాంగ్:—ఇది ఇంగ్లీషువారికిజెందిన రేవుపట్టణము. ఇదియొకద్వీపము మీాదనున్నది. యుద్ధ నావలుండు చోటు. చైనాదేశపు విదేశవ్యాపారమంతయు ఈ రేవుగుండ జరుగుచున్నది.

3. జపానుదేశము

10. టోకియో:—జపాను స్సామ్రాజ్యమునకు రాజధాని నగరము.

11. నాగసాకీ
12. కోబ్
} ఇచ్చట ఇనుము, నేలబొగ్గు, గంధకము, విరివిగ దొరకుటచేత వివిధ పరిశ్రమలు జరుగుచున్నవి.

13. ఒసాకా:—ఇతరదేశములనుండి ప్రత్తి తెప్పించి ఇచ్చట వస్త్రములు నేయుచున్నారు. దీనికి జపానుయొక్క 'మాంచెస్టరు' అని పేరు.

14. ఫార్మోజా:—ఇది జపానుస్సామ్రాజ్యములో చేరిన ఒక ద్వీపము. ఇచ్చటనుండి కర్పూరము ఎగుమతి అగును.

4. టిబెట్టు

15. లాసా:—ఇది టిబెట్టునకు రాజధాని నగరము. ఇచ్చట నుండి కస్తూరి, రాతి ఉప్పు, వెలిగారము, ఎగుమతి అగును. ఇది వ్యాపారస్థలము.

5. ఆశియామైనరు

16. అంగోరా:—రాజధాని నగరము

17. స్మర్నా:—దీని సమీాపమున పొగాకుపండును.

18. బాకు:—ఇచ్చట నూనె బావులుగలవు.

6. సిరియా

19. డెమాస్కస్:—ఇది సిరియాకు రాజధానినగరము. ఇది వ్యాపారస్థలము.

20. అలెప్పో:—ఉత్తర సిరియాకు రాజధాని నగరము. వర్తకస్థలము.

7. పాలెస్టీను

21. జెరూసలెమ్:—ఇది పాలెస్టీను దేశమునకు రాజధాని నగరము. ఇది క్రైస్తవులకు ప్రధాన యాత్రాస్థలము.

8. అరేబియా

22. ఏడెన్.—ఇది రేవుపట్టణము. ఆంగ్లేయులకు జెంది యున్నది. మన దేశమునుండి ఐరోపాఖండమునకుపోవు స్టీమర్లు ఇచ్చట ఆగును.

23. మక్కా } ఇవి ఇచ్చటి ముఖ్యపట్టణములు.
24. మదీనా } మహమ్మదీయులకు యాత్రాస్థలములు.

9. ఇరాక్ (మెసపొటేమియ)

25. బాగ్డాడ్:—ఈ దేశపు రాజధానినగరము. ఇండియా నుండి లండనుపోవు విమానమార్గము దీనిమీదుగా పోవుచున్నది.

26. బాస్రా:—ఇది ముఖ్యమైన వర్తకస్థలము.

10. ఇరాన్ (పర్షియా)

27. టెహరన్:—ఇది పర్షియా దేశమునకు రాజధానినగరము, వ్యాపారస్థలము.

11. ఆఫ్ఘనిస్థానము

28. కాబూల్:—ఇది కాబూలునది మీదనున్నది. ఆఫ్ఘనిస్థానమునకు రాజధాని నగరము.

12. సైబీరియా

29. టొబొలస్క్:—దీని సమీపమున సరగుడు అరణ్యములుగలవు. ఉన్ని, చర్మముల వ్యాపారములకు, ముఖ్యపట్టణము.

30. ఇర్కుట్స్క్:-దీని సమీపమున నేలబొగ్గుగనులుగలవు.

31. ఒమస్క్:—ఇది గోధుమపంటకు, పశుపాలనకు, కేంద్రస్థానము.

| దేశములు | పంటలు |
|---|---|
| 1. హిందూదేశము | వరి, జనుము, ప్రత్తి, గోధుమలు, కాఫీ, తేయాకు, రబ్బరు. |
| 2. బర్మాదేశము | టేకు, వరి. |
| 3. ఉత్తరచైనా | గోధుమలు, జొన్నలు, చిక్కుడు, బటానీ, |
| మధ్యచైనా | వరి, గోధుమలు, తేయాకు, ప్రత్తి, చెఱకు, |
| దక్షిణచైనా | వరి, ప్రత్తి, పొగాకు (డెల్టాభూములలో) తేయాకు, నిమ్మ, నారింజతోటలు (అడవులునరికి) |
| 4. జపాను | వరి, గోధుమలు, బార్లీ, తేయాకు, పొగాకు, |
| 5. టిబెట్టు | గోధుమ, బార్లీ. |

6. ఆశియామైనరు
7. సిరియా
8. పాలెస్టీను } గోధుమలు, బార్లీ, ద్రాక్ష, నిమ్మ, నారింజ, ఆలివ్ గలవు.
9. అరేబియా యమెన్, ఓమెన్ రాష్ట్రములలో కాఫీపండును. ఖర్జూరము అచ్చటి ముఖ్యపంట.
10. మెసపొటేమియా (ఇరాక్) గోధుమ, బార్లీ, వరి, పొగాకు, ప్రత్తి, ఖర్జూరము.
11. పర్షియా (ఇరాన్) గోధుమలు, బార్లీ, వరి, ద్రాక్ష.
12. ఆఫ్ఘనిస్థానము గోధుమలు, వరి, పొగాకు, మల్బరీతోటలు గలవు.
13. నాడీమండలపుదీవులు రబ్బరు, సగ్గుబియ్యము, కొబ్బరితోటలు, వరి, చెఱకు, కాఫీ, సింకోనా, సుగంధద్రవ్యము లభించును.

ఇతర విషయములు:—

ఋతుపవన ప్రదేశములు:— 1. హిందూదేశము, 2. సయాం, 3. ఇండోచైనా, 4. జపాన్, 5. చైనా ముఖ్యవృత్తి వ్యవసాయము.

జపాను పరిశ్రమలందు వృద్ధిపొందుటకు కారణములు

1. ఈ దీవులందు నేలబొగ్గు, ఇనుము, విరివిగ దొరకును.
2. తీరరేఖ చీలియుండుటచేత వ్యాపారానుకూలముగ నున్నది.
3. అచ్చటి శీతోష్ణస్థితి పరిశ్రమలకు తోడ్పడుచున్నది.

జపానుదేశమున ముఖ్యపరిశ్రమలు:—

ఉక్కు, గాజుసామానులు తయారుచేయుట. ఆటవస్తువులు, నిప్పుపెట్టెలు, పింగాణీసామానులు, బట్టలు, కాగితముతో చిత్రవిచిత్రమైన వస్తువులు తయారుచేయుట.

చైనాదేశములో ముఖ్యపరిశ్రమలు:— పింగాణీపాత్రలు తయారుచేయుట, పట్టుపరిశ్రమ. (సశేషము.)

---

# తెలుఁగు వెలుఁగు

బాలకవి అన్నాప్రగడ వీరరాఘవయ్య

తే॥ గీ॥ శ్రీనిధానంబు నగుచు సుస్మేరమగుచు । మాన్యకీర్తి ప్రభా భాసమాన మగుచు
దేశదేశాల ప్రతిభతో దీటుగనుచు । దివ్యమై తేజరిలె మన తెలుఁగు వెలుఁగు.

చ. చలనమె ముఖ్యసూత్రమని చాటెడు నీయురుకాలవాహినిం
గలయుచు మున్ని తేలెడి యగాధపుభారతగాథలోన దా
జిలిబిలి ముద్దుముచ్చటల చిన్నెలు దిద్దెను తెల్గువెల్గు సం
కలిత యశోనురక్తి యొకకారణమై మురు వీనుచుండగన్.

సీ॥ పగరకుఁ వెన్నిచ్చి పాఱునాధుని నని, కంపె ధైర్యదృత సాహసిక యొకతె
అరి చమూతతుల యుద్ధావనిం జెండ నాత్మజు బలినిడె వీరమాత యొకతె.
చరితార్థ యగుచు రాచటికంబు సంస్కరణించె లోకస్మరణీయ యొకతె
తేట తేనియ లూఱు తీయనినుడులతో లిఖయించె కావ్యముల్ లేమ యొకతె,
తే॥ గీ. సాహసమ్ము స్వార్థత్యాగ సరణి ధృత స । మర్థతాగరిమంబు వాఙ్మయవిధాన
పాండితీ నిపుణత వీరవనిత'లందు । తిరముగా నిల్పినది మన తెలుఁగు వెలుగు.
సీ॥ వేదశాస్త్రపురాణ విద్యలన్నింటిలో, సభలలో వాదంబు జరుపలేదె
ఆసేతుహిమనగ మఖిలభారతమహీ, స్థలిని బూజాపీఠి నిలుపలేదె!
ప్రాక్పశ్చిమద్వీపవారమ్ముతోడి వా, ణిజ్యాన కీర్తి గణింపలేదె,
కలము కుంచియ యూని కావ్యశిల్పము లందు వన్నె వాసి యొసంగవరలేదె,
తే॥ గీ॥ నాగరికతను ప్రథిత విజ్ఞాన సుధను । సర్వఖండాలలో వెద జల్లలేదె,
తెలుఁగువార లానర్పని దేమి? కనులు। తెఱచి పరికింపు మీనాడు తెలుగుబిడ్డ!

---

# పాఠశాలా నిర్వాహణమునందు నూతనపద్ధతులు

చింతలపాటి లక్ష్మీనారాయణ టీచరు - మానేజరు
జయలక్ష్మీ హిందూ ప్రాథమికపాఠశాల, బెజవాడ.

పాఠశాల సక్రమపద్ధతులపై నడుచుచున్నట్లు గమనింపబడుటకు మేనేజర్లుగాని, ఉపాధ్యాయులుగాని, బహు జాగ్రత్తతీసుకొననవసరమున్నది. ఇందుకు ఉపాధ్యాయులు కొన్ని నూతనపద్ధతుల నవలంబించి ముఖ్యముగా నీ దిగువ సూచించిన మూడు విషయములయందు ఆయా పద్ధతులతో పాఠశాల పురోభివృద్ధికి పాటుపడవలెను.

1. విద్యార్థులనుంచి హాజరును వృద్ధిచేయుట.

2. తరగతిగదులు, ధరించు దుస్తులు, శరీరారోగ్యము, స్కూలుపరిసరముల యందు పరిశుభ్రత, యిత్యాదివిషయములలో బాలురు స్వయముగా జోక్యము కలుగ జేసికొని, ఆరోగ్యాభివృద్ధి కొరకు పాటుపడునట్లు చేయుట.

3. క్రమశిక్ష, సత్ప్రవర్తనాది విషయములయందు జాగరూకలుగా నుండునట్లు చేయుట.

పై జూపినవాటిలో మొదటివిషయమును ఉపాధ్యాయులు గమనించు విధానము.

ఒక జెండాగాని, లేక కొయ్యతోచేసిన షీల్డుగాని తయారుచేయించి దానిమీద "Certificate of merit for good attendance" లేక తెలుగులో "మంచిహాజరునకు యోగ్యతాపత్రము" అనిగాని పెయింటుచేయవలెను. దీనిని వారమున కొకసారి ఒక క్లాసులోనుండునట్లు మార్చవలెను. ఏ తరగతిలో గతవారములో మంచి హాజరు

కాన్పించునో ఆ తరగతియందు దీనిని నుంచవలెను ఇందుకు ప్రతినిత్యము హెడ్మాష్టరు అన్ని తరగతులలోను రోలు, హాజరు వేరే చిన్ననోటుపుస్తకముమీద గుర్తించుకోవలెను. వారముచివరను తరగతివారీగా సరాసరిరోలు, సరాసరిహాజరు, తీసుకొని వాటి శాతములను కనిపెట్టవలెను. ఎక్కువశాతము ఏ తరగతిలోనున్నదో ఆ తరగతి వారు దానిని ఆ వారములో గెలుపొందిరని నిర్ణయింపవచ్చును. మరుసటివారము రోజులు ఆ జెండాను లేక షీల్డును గెలుపొందిన తరగతిలోనే యుంచవలెను. వారము యొక్క ఆవరేజిశాతము కనిపెట్టుటకుగాను ఈ దిగువ జూపిన ఉదాహరణమువల్ల తెలిసికోవచ్చును.

ఒకవారమున మాస్కూలులో తరగతివారీ సరాసరి రోలు, హాజరు.

| తరగతి | రోలు | హాజరు | శాతము |
|---|---|---|---|
| 1 | 10 | 24 | 80% |
| 2 | 18 | 14 | 77% |
| 3 | 22 | 18 | 82% |
| 4 | 16 | 13 | 81% |
| 5 | 16 | 15 | 93% |

పై అంకెలనుబట్టి 5 వ తరగతి హాజర్ బాగుగా నున్నదని నిర్ణయించవలెను. ఈవిషయమువలన "విద్యార్థులకు తమతరగతులలో ఎవరును గైరుహాజరుకాగూడదు" అనెడి యుద్రేకముద్భవించి మరుసటివారములో దానిని గెలుపొందు ప్రయత్నము మీదనుందురు. ఐకమత్యము, సంఘీభావము మొదలైన యున్నత భావములతో ఉత్తీర్ణులగుటకు పూనికతో పనిచేయుదురు. అందువలన గైరుహాజరగు విద్యార్థుల మంచిహాజరు కొరకు తక్కిన విద్యార్థులు వారంతటవారే బాధ్యతవహించి స్కూలుకు పిలుచుకొనివచ్చెదరు.

రెండవ విషయము:— ఆరోగ్యాభివృద్ధికొరకు బాలుడు స్వయముగా ప్రయత్నించునట్లుగా జేయుట. పరిశుభ్రత వగైరాలు బాలురచే గమనింపజేయుటకు కూడా ఒక రంగులజెండాగాని, ఆకర్షణీయమైన షీల్డుగాని, చేయించిదానిమీద "Certificate of merit for good hygiene" "ఆరోగ్యాభివృద్ధి యోగతాపత్రము" అని పెయింటు చేయించుకొనవలెను. ఏ తరగతిలో ఆరోగ్యము బాగుగానున్నదో ఆ తరగతిలో దాని నుంచునట్లు చేయవలెను. దీనిని వారమున కొకసారి తరగతులలో మార్చవలెను. దీనికి హెడ్మాష్టరుగాని, మేనేజరుగాని, ప్రతినిత్యము అన్నితరగతులను ఒకదాని తరువాత నొకదానిని పరిశీలించవలెను. ఆ పరిశీలించుటలో యీవిషయములను గమనించవలెను.

1. కాగితపుముక్కలు, వేరుశనగకాయతొక్కలు, పుడకలు, వగైరా చెత్త సామానులు లేకుండగ చూడవలెను.

2. అందరు పిల్లల దుస్తు లెట్లున్నవిచూడవలెను.

3. శరీరపరిశుభ్రత తలదువ్వుకోని పిల్లలువచ్చుచున్నది, లేనిది పరిశీలించవలెను.

4. పిల్లలుకూర్చుండు గదియందు వెలుతురు, నేలపొడిగానుండి దుమ్ము లేకుండుట, గోడలకు పైభాగమున బూజు లేకుండగ చూడవలెను.

ఆరోగ్యమును పరిశీలించుటలో, ఈ దిగువ నమూనాపట్టీవలె మార్కులువేసి, వారముయొక్క ఫలితము కనిపెట్టవలెను.

తరగతి గదుల ఆరోగ్యాభివృద్ధి తెలుపు పట్టీ

| తరగతులు | సోమవారము 29—11—3 | | మంగళవారము 30—11—43 | | బుధవారము 1—12—33 | | గురువారము 2—12—43 | | శుక్రవారము 3—12—43 | | శని వారం | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఉ | సా | ఉ | సా | ఉ | సా | ఉ | సా | ఉ | సా | ఉ | |
| 1 | 7 | 6 | 8 | 6 | 6 | 7 | 8 | 7 | 8 | 6 | 4 | 73 |
| 2 | 5 | 6 | 7 | 4 | 8 | 9 | 7 | 7 | 6 | 7 | 6 | 72 |
| 3 | 9 | 7 | 9 | 7 | 9 | 7 | 9 | 6 | 8 | 6 | 7 | 84 |
| 4 | 7 | 8 | 7 | [illegible] | 7 | 6 | 8 | 7 | [illegible] | 7 | 6 | 75 |
| 5 | 8 | 9 | 8 | 7 | 5 | 8 | 7 | 6 | 5 | 8 | 7 | 78 |

పైమార్కులకు 10 మాగ్జిమమ్‌గానుంచి వేయబడినది. వాటినిబట్టి 3 వ తరగతి షీల్డు గెలుపొందినదని నిర్ణయింపవచ్చును.

ఇట్లే స్కూలు క్రమశిక్షను విద్యార్థుల సత్ప్రవర్తనాది విషయములను, వృద్ధి నొందించుటకు పైసాధనముల పద్ధతిని నవలంబించవలెను. ఈపద్ధతులన్ని మాస్కూలు నందు అమలుపరచి యుండుటచేత మా ప్రయత్నములు, సఫలీకృతము లగుచున్నందుకు మిక్కిలి సంతోషమును వెలిబుచ్చుచున్నాను. ఈ విధముగానే ఉత్సాహవంతులు ఇట్టివిషయములను పాఠశాలయందు ప్రవేశపెట్టి సఫలీకృతులగుదురని విశ్వశించుచున్నాను.

---

# నీ తి ప్ర బో ధ ము

రచయిత : నేమాని కుటుంబశర్మ

మనకువిద్యాశాఖాధికారులొసగినవిద్యాప్రణాళికలో ఒకటవతరగతిమొదలుఎనిమిదవతరగతివఱకు "మత్రప్రబోధము"నీతిప్రబోధముఅనునొకపాఠ్యాంశమునుఅభిమానపాఠ్యాంశములలో (Optional sbj:cts) చేర్చియున్నారు. సంతోషము. కాని ప్రాథమిక పాఠశాలలలోను, ఉన్నతపాఠశాలలలోను, ఉపాధ్యాయులు "నీతిప్రబోధమును" త్రోసిపుచ్చక హెచ్చు ప్రాశస్త్యమియ్యవలసి యున్నది. వారమునకు రెండు గంటలైనను బాలురకు నీతులు నేర్పుచు వారందఱును ఆ విధముగ ప్రవర్తించునట్లు చేయవలెను.

"విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుండే

పాదయుగముతోడి పశువుగాక'' అని ప్రహ్లాదుఁడు నుడివెను. మనుష్యుఁడై పుట్టినందులకు, శిశ్నోదరపరాయణుఁ డగుచు జన్మనిరర్థక మొనరించుకొనక జ్ఞానవంతుడై జన్మరాహిత్యముకొఱకు పాటు పడవలెను. కాన ప్రతిమనుజుఁడు ఇంద్రియారాముఁడు కాక ఆత్మారాముఁడు కావలెను. పారమార్థికవిషయమున పాటు పడువానికి "నీతిప్రబోధమను" పాఠ్యాంశము సహకారి యగునట్లు ప్రస్తుతముఁ పారశాలలలో నేర్పబడుచున్న యితర పాఠ్యాంశములు ప్రయోజనకారులు గానేరవు. లోకమున నీతులు చెప్పువారేకాని, వానినాచరణయందు పెట్టువారు లేరను లోకోక్తిని సార్థకముచేయక, ప్రతి ఉపాధ్యాయుఁడు ఆచరణయందుంచి, పాఠశాలలలో నీతిప్రబోధ మొనరించుచు, ప్రతి విద్యార్థి అట్లు ప్రవర్తించునట్లుచేయవలెను.

బాలురకు తరగతుల ననుసరించి కథలమూలముగను, నాటకరూపముగను, నీతిపద్యములులేక సుభాషితముల వలనను, నీతులు, ధర్మములు, గఱపవలెను. నీతిబోధకములగు శతకములు (సుమతి శతకము, భాస్కరశతకము మొ॥) భక్తిరస భరితములగు శతకములు (కృష్ణశతకము, దాశరథిశతకము, భక్తచింతామణి శతకము, మొదలగునవి) ఆయాతరగతులకు తగినట్లు చదివించుటమంచిది. భాగవతములోని గజేంద్రమోక్షము, కుచేలోపాఖ్యానము, రుక్మిణీకళ్యాణము, భారతములోని విదురనీతి నలోపాఖ్యానము మొదలగు ఘట్టములను, భర్తృహరి సుభాషితము, ఆర్యకథానిధి, పంచతంత్రము, అష్టాదశ పురాణ సారసంగ్రహము, సత్కథామంజరి, బాలదేవీభాగవతము, రామాయణము (వెషేల్ల) మొదలగు నీతిబోధకములగు గ్రంథములను 5,6,7, తరగతివిద్యార్థులచేతను, ఉన్నతపారశాలలయందలి విద్యార్థుల చేతను, తప్పక చదివింపతగినవి. 1; 2, 3, 4 తరగతుల బాలురకు చిన్నకథలమూలముగ నేర్పవలెను. విద్యార్థులచే నీతిబోధకములగు కథలను వ్యాసరూపముగ వ్రాయించుట,నాటకరూపముగ ఆడించుట యొనరించినచో అవి గొప్ప శ్రేయస్సు నొసగగలవు.

బాలురకై వ్రాయఁబడిన నీతికథల పుస్తకములు పెక్కు వెలువడినవి. కాని అవి చాలవఱకు నీతిబోధకము లుండవలసిన రీతి నుండలేదని తలఁచెదను. నీతులను బోధించు కథలతి విస్తారముగనో అతిసంక్షేపముగనో యుండి, ప్రధాన విషయమిదియని తెలుసుకొనుటకు వీలు లేనిస్థితిలో నుండరాదు. నీతిబోధకమగు నొక కథను చదువునపుడె యందలి యాదర్శము చదువరి కేర్పడవలెను. అట్లున్నచో చదువునపుడాతని మనస్సు దానియందె నిలిచియుండును. కథను పూర్తిగ చదువునప్పటి కాతని కాభావముఁ స్థిరపడవలెను. చివరనున్న సారాంశము ఆనీతిని మఱింతదృఢపఱచవలెను. బాలురు చదువతగిన గ్రంథములిట్లున్ననే ప్రయోజనకారులని నా యాశయము. ఈ క్రమములో బాలురకు నీతులను బోధించినచో వారు సత్ప్రవర్తన గలవారై తమమానవజన్మ సార్థకము చేసికొనగలరు.

ఇచ్చట ఆక్రమము ననుసరించి వ్రాయఁబడిన కథనొకదానిని ఉదాహరణముగ

పొందుపఱచితిని. శీర్షికను చదువునపుడె కథలోనిముఖ్యాంశమిదియని బోధపడును. దానివివరమునే మొదటి పద్యము చెప్పుచున్నది. మఱియు కథాసారాంశమును, దానిని బలపఱచునొక ప్రసిద్ధ పద్యమును, గలవు. ఆద్యంతములయందుండు పద్యములను బాలురచే కంఠస్థముచేయించినచో వారికి ప్రతి కథ జిహ్వాగ్రమందుండుననుటకు సంశయము లేదు.

## "చేసినపాపము చెఱుపక విడువదు"

## (శీర్షిక)

గీ. ఎఱుఁగ కొనరించినను బాప మెవరుగాని
　కట్టి కుడుపకపోదది యెట్టులైన,
　బాల్యమందుఁ దూఁగల బాధపఱచి
　యనుభవింపఁడె మాండవ్యుఁ డాఫలంబు

### —ఆణి మాండవ్యుఁడు—

పూర్వము మాండవ్యుఁడను నొక బ్రాహ్మణుఁడుండెను. అతఁడు సకలధర్మములఁ దెలిసినవాఁడును, సత్యముఁ దప్పనివాఁడునై, సమస్తతీర్థముల సేవించి యొకచోట నొకయాశ్రమము నేర్పరచుకొని తపస్సుచేసికొనుచుండెడివాఁడు. ఇట్లు కొంతకాలము గడచెను. ఒకనాఁడతఁడు తన కుటీరము దాపుననుండు నొకచెట్టుక్రింద, చేతులుపైకెత్తి మౌనవ్రతముఁ దాల్చినిలిచి, తపస్సుచేసికొనుచుండెను. ఆసమయమునఁ గొందఱు దొంగలు దొంగిలినధనముతోఁగూడఁ బఱుగిడుచు రక్షకభటులవలని భయమునఁ దాముపోవు త్రోవలోనున్న యామాండవ్యుని యాశ్రమములోఁదూఱి, అందొకచోట నా ద్రవ్యమును బ్రాఁతిపెట్టి యందే యొకమూలదాఁగియుండిరి.

ఇంతలోఁ దలవరులు చోరులను దఱుముకొనుచువచ్చి, తపస్సుచేసికొనుచున్న మాండవ్యునిసమీపించి, "బ్రాహ్మణోత్తమా! ఇటుపరుగెత్తివచ్చిన దొంగలేదారిని బోయిరి? మేము వారిని శీఘ్రముగ వెంబడింపవలసియున్నది. ఆలసింపక తెలుపుఁడు" అని యడిగిరి. అట్లువారెన్నితూరులడిగినను సమాధిలోనున్న యామునియొక పలుకైనఁబలికినవాఁడుకాడు. అంతనా తలారులు కుపితులై, బలాత్కారముగ నతని యాశ్రమములోఁ జొరబడి, నలువైపుల వెతకి, ఒకమూల దాఁగియున్న దొంగలను, వారందుఁబాతిపెట్టిన ధనమును, గనుగొనిరి. దానిచే వారికాముని మీఁదను సంశయము కలిగెను. వారపుడు దొంగలతో మునినిగూడఁ బట్టుకొనిపోయి తమరాజున కొప్పగించిరి. రాజును విచారణలేక అందఱను గొఱుతవేయ నాజ్ఞాపించెను. రాజాజ్ఞనుబట్టి తలారులామునిని గూడఁ గొఱుతవేసిరి.

కొఱ్ఱునందుపఁబడినను, ఆమునిశ్రేష్ఠుడు చాలకాలమువఱకు కట్టేయాహారము లేకను, మరణింపకను, ఉండి తపస్సు చేసికొనుచుండెను. అతని కష్టమును జూచినవారు మిగులఁ బరితాపపడుచుండిరి. ఆ ఋషివరుని మహిమను గాంచి, కావలివారు జడిసి, ఆ సమాచారము ఉన్నది యున్నట్లుగా రాజునకుఁ దెలిపిరి. రాజప్పటికి దెలివి దెచ్చికొని, ఆతనిని గొప్పఋషిగ నిశ్చయించి, వెంటనే మంత్రులతోఁ గూడ నచటికిఁ బోయి, కొఱ్ఱున నున్న ఋషికి సాష్టాంగపడి "నా తప్పును మన్నింపుము" అని వేఁడుకొనెను. మునిశ్రేష్ఠుఁడాతని యపచారమును 'మన్నించితి' ననెను. అంత నా తలారులు రాజాను

మతిచే నామునిని మెల్లగ దింపి, శూలము ను దీసివేయుటకుఁ దమశక్తికొలఁది యత్నించిరి; కాని సాధ్యముగాకపోయెను. వారపుడు చేయునది లేక, దానిని నడుగు మట్టమునకు విఱిచివేసిరి. ఆముని శూలపు దునుక తనలోనే నిలిచి యుండినను దానితోఁ దిరుగుచుండెను. ఆతఁడా శూలపుఁగొనకుఁ బూలబుట్టను దగిలించుకొనవచ్చునుగదా ! అని మిక్కిలి సంతసించెను. ఆశూల మట్లుండుటవలననే అణిమాండవ్యుఁడు అను ప్రసిద్ధి యాతనికిఁ గలిగెను.

అణిమాండవ్యుఁ డొకనాఁడు యమలోకమునకుఁ బోయి, సింహాసనమునందుఁ గూర్చుండియున్న ధర్మదేవతను జూచి, "నేనిట్టి దుష్ఫలము ననుభవించితినిగదా ! దీనికి నేను దెలియకుండఁ జేసినపాపమేమి" అని యడిగెను. అందుకా యమధర్మరాజు "ఓతపోధనా ! నీవు బాల్యమున దూనీఁగలఁ బట్టి వానితోఁకలకు ముండ్లు గ్రుచ్చి, యాడించుచుండెడివాఁడవు. ఆ పాపకర్మమునకు ఫలముగ నిపుడీ కష్టము ననుభవించితివి." అనిచెప్పి "బ్రహ్మర్షీ ! దానము స్వల్పముగ నీయఁబడినను బెక్కుమడుఁగు లెట్లగునో, పాపమునట్లే కొంచెమైనను నధికదుఃఖము నొసఁగును." అని నుడివెను. పిదప వారికిఁ గొంత సేపు సంభాషణము జరిగెను. అవల మాండవ్యుఁడు యముని కడ సెలవుదీసికొని నిజాశ్రమున కేగెను.

కనుక యెవరుగాని యెప్పుడైన, ఏ జంతువునకేని, వేడుకకైన బాధ, గలుగఁ జేసినచో ఆపాపకర్మమునకుఁ దగిన ఫల మెప్పటికైన ననుభవింపక తీఱదని స్పష్టమగుచున్నది.

> ఆ. పాప మనఁగ వేఱె పరదేశమున లేదు
> తనదు కర్మములను దగిలియుండు,
> కర్మిజనుఁడు తాను గన్నులఁ జూచిన,
> విశ్వదాభిరామ వినురవేమ.

ఈరీతిగ పురాణములోని కథలను 5,6 7,8 తరగతి బాలురకు చెప్పి వానిని చదివించవలెను. ఇట్టి నీతిబోధకమగు గ్రంథములను చదివించుటచే భాషాజ్ఞానము కూడ వృద్ధిపొంది, మన తెలుగుభాష యందలి మాధుర్యమును గ్రహించి, పెక్కు పురాణములను ప్రబంధములను చదివి వాని సారమును గ్రహించుటకవకాశ మేర్పడఁగలదు. ఓం, తత్సత్.

---

# తోటమాలి

చిలకా వేంకటకృష్ణదాసు

౧. తలపయిన్ రంగుపాగాను దాల్చి తనదు । పాటులో మున్గి వేగిరపాటుతోడ
నిటునటుల్ నీటిపాత్రతో నేగుచున్న । తోటమాలినిఁ గంటి సంతోషముగను.
౨. తోయములజల్లు దారులధూళి నడప । తలలువాల్చిన మొక్కలదాహ మణప
పువులు వికసింప మొగ్గలు పూలుపూయ । నిల్లుబోయుమ ముదముతో నెగడునతడు.
౩. ఫలములన్ దొంగిలింపంగ వచ్చునట్టి । కొంటెపిల్లల రానీక వెంటబెట్టు
క్రొమ్మొలక పెంపునంతను వమ్ముసేయు । పిచ్చుకగుమి దూరానకు వెళ్ళగొట్టు.

౪. పూలువికసించి తావులు పొంగిపొరల | పిట్టజాలము గుంపుతో పాటపాడ
విత్తులన్ నాటగాబోవు వృద్ధిగాంచి నాణ్యమౌ బారులందున నాటుచుండు.

౫. జనములందఱు సాయాహ్న సమయమందు | సంతసంబున కాలంబు చక్కబుచ్చ
నూతిచెంతను కూర్చుండి ప్రీతితోడ | తా నొనర్చినపనియెల్ల దలచుకొనును.

౬. రామణీయకమైన యారామమందు | సృష్టివైచిత్ర్యమును పరిశీలనమున
గుర్తెఱుంగుచు దేవుని గొప్పతనము | మాటిమాటికి మనసులో స్మరణజేయు.

౭. సంజకెంజాయ నాట్యంబు సల్పుచుండ | కూజితములతో విహగముల్ గూండ్లుజేర
తానుకోసిన సుమములు దండగుచ్చి | యింటికింబోవు చుక్కలు మింట నలర.

౮. మనకు సంతోషదంబైన వనముకొరకె | తనదు జీవితభాగ్యంబు ధారవోయు
ప్రతిఫలము గోరనట్టి సద్భాగ్యజీవి | నిఖిలజనులకు సంస్మరణీయుఁడతఁడు.

---

# సృష్టి పరిశీలన

(తాతా సత్యనారాయణ)

సృష్టిపరిశీలన మను విషయము మన పాఠ్యప్రణాళికలో జేరినది. ఇది విజ్ఞాన (Ele. Science) విషయములలో జేరినదైనను, భిన్నమార్గములు ననుసరింప దగియున్నది. విజ్ఞానపాఠములు పరికర సహాయమును గోరునట్టివియై, బాలుర ప్రయోగ, పరిశీలనాది సారాంశసూత్రముల గ్రహింప దగియున్నవి. సృష్టిపాఠములన్ననో యటుల గాదు. సృష్టిలోని వస్తుసముదాయమే యుందు పరికరములు పరిశీలన యే ముఖ్యాంగమును, జ్ఞానాభివృద్ధియే ప్రధానోద్దేశమును, గాగలదిది. అయిన నీజ్ఞాన సంగ్రహణమున నొక క్రమము ననుసరించుటయే యుపాధ్యాయుని పని యగును. ఇందుబాలురు స్వయముగను, నుపాధ్యాయుని తోడను, సృష్టిలోని వస్తు సముదాయమును బరిశీలించి, తమజ్ఞానమును వృద్ధి నొందించుకొనెదరు. ఇచట నంశముకన్న పరిశీలననేర్పు నలవడజేయుట ముఖ్యతర మనవచ్చును. పిల్లలు సహజముగ తమగృహసీమల నుండియు, నింద్రియముల ద్వారమున జ్ఞానాభివృద్ధి జెందెదరు, వారలు బడికి జేరగనే యా సహజమార్గముల మనము విడనాడ గారణము కానరాదు. కావున పాఠ్యభాగము బడికాలమున మొదటి నాలుగైదు వత్సరముల తరగతుల వారలకు ముఖ్యముగ దగియున్నది; విజ్ఞానపాఠములు మాత్రమింకను పెద్ద తరగతులవారి కర్హమనవచ్చును.

సృష్టిపాఠముల యుద్దేశము ననుసరించి మనబోధనాంశ పద్ధతు లుండవలెననుట సమంజసము. తన భౌతిక పరిసరముల యెడ బాలున కుత్సాహ సానుభూతులు గలుగజేయుట ప్రధానముగ నెంచవలెను; అతని మనమునకు మంచిశిక్షణ నొసంగవలెను, భౌతిక పరిసరజ్ఞానమును గూడ నాతడొందవలెను, తన జ్ఞానభావముల నతడు, క్రమముగను, బాగుగను, ప్రక

టింప నేర్పునొందవలెను. సృష్టిలోని సౌందర్య సౌమనస్యములను, సమాన సూత్రమును, గ్రహించునేర్పును, వానికారణభూతుడగు భగవానుని యెడభక్తియును, గలిగించునవిగ నీపాఠ్యాంశము లుండుట వాంఛనీయము.

ఈ పాఠ్యబోధన పద్ధతులు మన యుద్దేశముల నొనగూర్చునవిగ నుండుటకు దోడు బిడ్డలసహజ మానసిక వికాసముల కనుగుణ్యముగ నుండవలెననుట యెన్నదగిన విషయము. కనుక ప్రదర్శనీయ మగు విషయము బాలుర గ్రాహ్యగ్రహణ శక్తుల కతీతముగ నుండరాదు. విషయము పరిచిత కోటిలోనిది మాత్రమేగాక, క్రొత్తదృక్పథమున బ్రయోగింపబడవలెను. బిడ్డలసహజ చులుకుదమునకు, సక్రమవికాసము కలిగింపవలెనుగాన, వారలు కలము కాగితములకన్న యెక్కుడుగ పరిశీలనాది కార్యములందు నిమగ్నులుగనుండి .నేత్రముల, జేతుల, మనముల, నుపయోగించు నవకాశములుండవలెను. తత్ఫలితముగ నుపాధ్యాయుడు ప్రశ్నల ప్రయోగము నరుదుగ నుపయోగించుచు, నెక్కుడుగ వస్తుసంపర్క పరిశీలనములును, వాని తారతమ్యగ్రహణములును, వస్తువిభజన వివేకమును, బెంపొందింపవలెను. బాలుర యూహాసామర్థ్యమును నాతడు రెచ్చగొట్టవలెను. అంశవిషయములు భిన్నభిన్నములుగగాక, ఒకదానితో నొకటిసంబంధపఱచి, పరిసరములతోడ నైక్యతగలిగింపవలెను. ఇట్లే యీ పాఠ్యవిషయములు భూగోళాది యితర పాఠ్యవిషయములతో గూడసంబంధపఱుపబడుట వాంఛనీయము. మొత్తమున నీసృష్టిపాఠములు బిడ్డలలో నాయాపరిసర వస్తుసముదాయమునుగూర్చి ప్రోత్సాహ సానుభూతులంబురికొల్ప జాలియుండవగును.

నిత్యమును సామాన్యముగ బిల్లలదృష్టిని బడు వస్తుసముదాయమునే పాఠశాలలందు పఠనీయాంశముగనుంచినచో, వారలు పూర్వము ప్రయోజనరహితములని తలచి నాశనము జేయ వెనుదీయని యాయావస్తువుల యెడ వారికపూర్వకమగు నాదరాభిమానములు కలుగును. పల్లెజీవితమునందొక యాకర్షణాశక్తి యేర్పడును. కంటికిని, జేతికిని, పనికల్పించుటచే వారలసంతుష్టుల జేయును. పరిసరములగూర్చి వారలుపాధ్యాయునిఁ బ్రశ్నించునటుల వారల యుత్సాహమును బ్రోత్సహించవలెను. వారల ప్రశ్నలు "ఏమి" అనుటకన్న "ఎందుకు" "ఎట్లు" అనుపద గర్భితములై యుండవలెను. పాఠ్యబోధనాంతమున సారాంశమును బ్రశ్నించి రాబట్టుటయును, వ్యాసలేఖనమును, మనమీయెడఁజేర్పదగిన విషయములేయగును.

ఇక వస్తుపరిశీలనమున, నొక క్రమము ననుసరించుట ముఖ్యము. తొలుత పరిశీలించువస్తువును నామసహితముగ గుర్తించుటయును, దాని సంబంధములగు గాథలు, సామెతలు, స్ఫురణకు దెచ్చుటయును, బిడ్డలనుత్సాహపఱచును. పరిసరములతోడ నీవస్తువునకుగల సంబంధమును విచారించుట రెండవ యంశముగ నెంచవచ్చును. ఇందావస్తువుల జీవిత చరిత్ర మిమిడియుండును. ఈ చరిత్రాంశములు వానియవయవ నిర్మాణముల గూర్చియు, పరిసరములనడుమ జీవితమున కెట్లుతగియున్నదియును, విచారణకు మూలమగును.

పిమ్మట వివిధవస్తువులతోడి పోలికలకుం ప్రాముఖ్యము కలిగించి, వస్తుకుటుంబముల విభజన జేయించవచ్చును. ఇట్టి విధమున, నన్ని జీవరాసులందు నొక యద్భుతనిర్మాణ కౌశలమును, వాని కర్తయగు దైవమును, మనోనేత్రమున గోచరింపజేసినటుల యగును. ఐహికముగ నెంతటి యల్పమగు జీవియు, నెటులమానుషోపయోగముగ నున్నదో బాలుర కెఱింగింపవచ్చును. సృష్టివస్తువులను నిత్యముజూచు సామాన్య వస్తువులుగగాక, అవియు ప్రాణులనియు, జీవితప్రవాహమున నవియెన్ని యోచిక్కుల నెదుర్కొనుచు, నెటులవానిని దాటుచున్నవో గ్రహింపజేసిన, బిల్లలకు వాని యెడల నాదరణాభిమానములు పెంపొందును. వారలు స్వయముగ సామాన్య వస్తుసముదాయమున గలిగియున్న జ్ఞానమును బెక్కుమడుగుల వృద్ధిజెందించుకొనుటకును, ప్రకటించుటకును, సమర్థులగుదురు. ఈపాఠ్యవిషయములు బడితరగతులలో నంశబాహుళ్యము ననుసరించి యేకకేంద్ర పద్ధతిని, పైతరగతులలో మఱల మఱల నొకేవిషయమొకింత విపులీకరణమొందునట్లు జేయవచ్చును. ఉపాధ్యాయు డీపాఠముల నెంతయు ప్రయత్నించి యవి కేవలము వస్తుపాఠములుగగాని (object lessons) పరపరన (Picture reading) విషయముగ గాని, మార్పుపొందకుండ గమనింపవలెను.

---

## బోధనాక్రమసూచిక

### (Teaching—Notes)

ప్రతాపరావు, నారాయణమూర్తి పట్నాయిక్.

i. బోధనాక్రమ సూచిక, ఉపాధ్యాయునకు, కరదీపికవంటిది. ఇట్టి దీపిక సహాయమున, ఉపాధ్యాయుడు తన కార్యక్రమమును, నిబ్బరముగను, నిరాటంకముగను, నెరవేర్చుకొనగలడు.

ఇది లాభకారియగుటచేతనేగదా ప్రభుత్వమువారు "బోధనాక్రమ పట్టికలు, ప్రతి యుపాధ్యాయుడును, తప్పక తయారుచేసుకొనుచుండవలెను." అని శాసించినది.

ii. అట్లు శాసించినప్పటికి, నేటివఱకు గూడ "బోధనాక్రమ సూచిక" అననేమో. తెలియని ఉపాధ్యాయులు కొందఱు లేకపోలేదు. అట్టివారు, పైసూచిక యొక్క ఉపయోగములను, దాని యుద్దేశమును, తెలియక అదియొక, రికార్డుగా, భావించి, భారమనియెంచి, ఏరెండు, మూడుమాసముల కొకతూరియో, లేక, పరీక్షు, తనిఖీ కాలమునకు ముందుగనో, శ్రమపడి, ఏవో వెట్టిమొట్టి గీతలతో ఒకపాత్రమును నింపి ప్రొక్కబడి దీర్చుకొనుచున్నారు. ఇది చాలా పొరపాటని చెప్పనగును.

iii. ఇక బోధనాక్రమ సూచిక, యొక్క, నిజాభిప్రాయమేమో, ఇంచుక విమర్శింతము.

ఈ సూచికయందు ముఖ్యముగా, మూడు విషయములు గలవు.

"1. బోధనాంశము, 2. బోధనావిధానము, 3. బాలురు చేయవలసిన పని."

1 వ విషయము — బోధనాంశము —

ఇందు పాఠముపేరు - కఠినాంశముల, విశదీకరణము - నల్లబల్లపై వ్రాయవలసిన సంగతులు - బాలురు జ్ఞాపకముంచుకోదగిన ముఖ్యవిషయములు - ఈ మొదలగునవి బోధనాంశమునకు చెందినవి.

2 వ విషయము — బోధనావిధానము —

దీనిక్రింద ఉపాధ్యాయుడుపయోగించు ఉపకరణములు-పరిశోధనలు - దృష్టాంతములు - ముఖ్యప్రశ్నలు - విద్యార్థులు, విసుగుచెందక ఆనందముగ నుండునట్లు చేయుటకు మధ్యమధ్య కల్పిత కథలు - వినోద వస్తువుల ప్రదర్శనము - ఈ మొదలగు విషయములు బోధనా విధానమునకు సంబంధించినవి.

3 వ విషయము — బాలురు చేయవలసిన పని —

దీనిలో బాలురు నోటితో చెప్పవలసిన జవాబులు - వ్రాతపని - చిత్తుపటములు- దేశపటములు గీయించుట-విద్యావిహారములు నిర్దేశింపబడిన ఆ సందర్భమున బాలురు చేయవలసిన పని - ఆ విహార కాలములలో విద్యార్థులు-ప్రోగుచేయవలసిన, మాదిరీలు-యీ మున్నగునవి బాలురు చేయవలసిన పనికి సంబంధించినవి.

పై నుదహరించిన మూడు విషయములు ఉపాధ్యాయుడు మూడు శీర్షికల క్రింద భాగించుకొని, తన నోట్సుపుస్తకములో వ్రాసుకొనవలెను.

ప్రతి పాఠ్యవిషయమునుగూడ పైవిధముగనే చక్కని ఉదాహరణములతో క్లుప్తముగా వ్రాసుకొనుట మంచిది.

లాభములు :—

(1) ఇట్లువ్రాసుకొనుటవలన, ఉపాధ్యాయునికి, అధైర్యము పోయి, పాఠమును ఉత్సాహముతో బాలురకు బోధించగలడు.

(2) మరియు, ఏపాఠమును, ఎట్లుబోధించవలెనో, ఎట్టిబోధన విద్యార్థులకు, రుచికరముగనుండునో, గమనించి, చక్కగా బోధించగలడు.

(3) ఏయే తరగతి విద్యార్థులకు ఎట్టెట్టి, పరిశ్రమలు చేయించవలెనో తాను ముందుగా వ్రాసుకొనుటచే, వారిచే, ఆయాపనులు, చక్కగా, చేయించగలడు.

కావున, నేటివఱకు కూడ, బోధనాక్రమ, సూచిక యొక్క విధానమును, ఉపయోగమును, తెలియని, ఉపాధ్యాయులు, ఈసూచనను, గ్రహించి, తమతమ, మనోశక్తులుపయోగించి, కాగితము కఱవులని తలంచక, నాయభిప్రాయమును, సాధ్యమగునంతవరకు, సార్థకము చేయుదురని, నాదృఢనమ్మకము.

# వసంతము-రైతు

కె. ఎ. స్వామి

గ్రామములనంటు పొలముల ప్రాంతమందు । క్రొత్తచిగురులమామిడి కొమ్మతొడిగె
కిసలయములను మెక్కి కోకిలలుపాడె । కుహు కుహూ యని కమ్మని గొంతులెత్తి.
మంచుమణగెను చలిగాలి మాయమయ్యె । ప్రొద్దుహెచ్చెను రాతిరి పొట్టిదయ్యె
చలువవెన్నెల జగతిపై చౌకళించె । భవ్యమైతోచె వాసంతప్రకృతికాంత !
వేపపూచేదు చక్కెరతిపి గలపు । దిన ముగాదిపండుగ యేగుదెంచె నంచు
సర్వజను లమితానందసాగరాన । తేలి యాడిరి భిన్నభావాలు వీడి.
పైడినాగటికఱ్ఱులో ప్రాణు లూర । లేగగిత్తల బూన్చిన నాగ లూని
తల్మాతలము దున్ని లొల్లతో చదునుచేసి । సస్యముల నిచ్చువిత్తుల చల్లెరైతు.
తెల్లకుచ్చులతలపాగ అల్లనాడ । పాలపొంగుల యారైతుబాలకుండు
పచ్చికబయళ్ళ వంశీరవంబు నిల్పి । ఆలకదుపుల మేపును లీలతోడ.
శాక్యమునిలోన దీపించు జ్ఞానమెల్ల । జీర్ణమొనరించుకొన్న సంజీవుడనగ
వసరుపచ్చిక నిచ్చమై మెసవి మసలు । మేకపోతుల గొఱ్ఱెల ప్రీతిఁగాచు.
కరుణశాంతుల కునికియా కాపుపడుచు । మొలకనవ్వుల తఱపివెన్నెలలు మెఱయ
కిలకిలం గూయు కోడిపిల్లలకు నెంతొ । ప్రేమతోడుత మేతను పెట్టిపెంచు.
ఫీదకృషికుని కొమరిత వేగలేచి । పల్లెపదములు మెల్లనపాడుకొంచు
శుద్ధఖద్దరురాట్నంబు శ్రద్ధఁబూని । త్రిప్పితీయును దారంబు మెప్పులెగయ.

---

# సంఘసేవ

## (బాల, భటోద్యమము)

ప్రతాపరావు నారాయణమూర్తి పట్నాయక్.

"మానవసేవయే, మాధవసేవ."

ప్రస్తుతకాలమున, మనదేశ మన్నివిధముల వెనుకబడియున్నది. 'ఎట్లన, అవిద్యవలనను, అజ్ఞానమువలనను, దారిద్ర్యమువలనను, గ్రామాదులు, పురికట్టుట లేదు. పరిశ్రమలు, వ్యాపారము, అభివృద్ధిచెందుటలేదు. రాజకీయాందోళనమువలన ప్రజలలో జాతీయభావము కొంతవరకు పునరుద్ధరింపబడినను, జాతి, మత, వైషమ్యముల మూలమున నది, యంతగ వృద్ధిగాంచుటలేదు. ఇట్టి తరుణమున మనదేశము నుద్ధరించుటకు, "స్వార్థపరతలేనట్టియు, దేశభక్తిపరాయణులగునట్టియు, శ్రమలకోర్చినైనను, దేశసేవచేయ సంసిద్ధులగునట్టియు, నాయకులనేకులు కావలెను" అట్టి నాయకులుగా తయారుచేయగలశక్తి "ప్రాథమికోపాధ్యాయుని యందిమిడియున్నది."

అందువలన, ప్రాథమికోపాధ్యాయుడు

పైనుదహరించిన విషయములు గమనించి, తన చిన్ని విద్యార్థుల నీవిధముగ తయారు చేయవచ్చును. 1. తల్లిదండ్రులయెడ భక్తి గల్గియుండుట. 2. పెద్దలను గౌరవించుట. 3. ఎన్నడు, అబద్ధములు చెప్పకుండుట. 4. దొంగతనము చేయకుండుట. 5. జీవ హింస చేయకుండుట. 6. సంఘీభావము గలిగియుండుట. ఇత్యాది సద్గుణగణములను ఉపాధ్యాయుడు బాలురకు నీతివాక్యములుగా వల్లింపజేసి వదలిపెట్టక, పై గుణములను, తా నాచరణలోనుంచి సద్వివేకము గలవాడై, ప్రవర్తించినయెడల, విద్యార్థులాయనను, తప్పక ననుసరింతురు.

చిన్ననాటనుండియు, అట్టి మప్పుగడ బాలురు పొందిన వెనుక క్రమముగ పెద్దవారగుకొలది వారిలో సద్వాసన, ప్రబలి సంఘీభావము గలిగి, పేదలకును, అనాథలకును, ఆపదలలో నుండువారికిని, తగురీతిని సహాయపడుటకు సాహసింతురు. ఇదియే బాలభటోద్యమ మందలి, ప్రధానాశయము. దీనినే బాల భటోద్యమ మందురు. పైసహాయకార్యములు (బాలభట ధర్మములు) చేయుటకు సాహసించువారికి ఉపాధ్యాయుడీరీతిగ హెచ్చరింపవచ్చును.

గొప్ప సంతలు జరుగుచోట్లను, తీర్థములయందును, సముద్రస్నాన ప్రదేశములయందును, పుష్కరక్షేత్రముల యొద్దను, జనసమ్మర్దమెక్కువగ యుండును. వృద్ధులు పసిబిడ్డలు, అపాయములకు లోనగుచుందురు. పిల్లలు తప్పిపోవుచుందురు. స్నానపు రేవులలో నీటిప్రమాదములుసంభవించును సంబరము చూడవచ్చిన ప్రజలు ఆప్రాంతమున విచక్షణలేక మల, మూత్ర విసర్జన చేయుదురు. అట్టి సమయములందు తరచు కలరావ్యాధులు పొడచూపి, విజృంభించును. కనుక ఇట్టి కార్యములందు తగు శ్రద్ధ తీసుకొనుట.

మరియు, పైనుదహరించిన విధులేగాక, అగ్నిప్రమాదముల యందు కాలుచుండు యిండ్లార్పుట, ఉప్పెనగాలులకు, అతివర్షములకు కొంపలు కూలినప్పుడు ప్రజలను రక్షించుట, దుర్దశలో నున్నవారికి సహాయార్థమై చందాల వసూలుచేయుట, ఆకస్మికముగా దెబ్బలు తగిలినవారికి తగు ప్రథమచికిత్స చేయుట, ఈ మొదలగు సద్బోధ (బాలభటధర్మములను) ఉపాధ్యాయుడు హెచ్చరించవలెను. ఇట్లు హెచ్చరిక చేసినందువల్ల క్రమముగా నీ లాభములను వారు పొందగలరు. '1. పై యుద్యమములందు తర్ఫీదు పొందువారికి ప్రజాసేవాపద్ధతు లలవడుటయే గాక, క్రమముగు నారోగ్యాభ్యాసములు గల్గి, ప్రవర్తన చక్కబడును. '2. నాగరికత యబ్బును. సోమరితనము నశించి, చాకచక్యము, చురుకుదనము; ఉత్సాహము, తెంపరితనము, కార్యదీక్ష, మున్నగు నెన్నియో సుగుణము లలవడును. '3. వారు ఎట్టిపనికైనను, అర్హులగునంతటి సమర్థత కలిగినవారగుదురు.

ఇట్టి మహోపకార కార్యమును ప్రాథమికోపాధ్యాయుడు తక్క, ఇతరులెవ్వరు చేయుటకు అశక్తులు. అందువలన ప్రాథమికోపాధ్యాయ మహాశయులందరు పై జెప్పినట్లు తమబడులలో ''బాలభటోద్యమము'' నెలకొల్పి దేశములన్నిటికన్న మిగుల హీనస్థితియందు మునిగియున్న మన భారత దేశమును పునరుద్ధరించి, శాశ్వతకీర్తి బడయుదురుగాక !

# విజ్ఞప్తి

ప్రాథమికద్రవ్యసహాయపు బడులలో పనిచేయు నుపాధ్యాయులు కష్టనిష్ఠురములను ప్రభుత్వమునకు వెల్లడించుటకు ప్రభుత్వమువారు తాలూకాయూనియన్లను ప్రసాదించిరి. జిల్లాగిల్డులు తూర్పు, పశ్చిమగోదావరి మొదలగు కొన్నిజిల్లాలలో స్థాపింపబడినవి. వీటినన్నిటిని రాష్ట్రసంఘమునకు చేర్చుటకు దానిని స్థాపించవలసియున్నది. ప్రస్తుతమున్న ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీ టీచరుమేనేజర్ల ఫెడరేషనులో టీచర్సుగూడ చేరుటకు తగుమార్పులను అందుచేసి యుపాధ్యాయలోకమునకు సదవకాశము కల్గజేయవలసినదిగా నేనును శ్రీ N. నీలకంఠం (తూర్పుగోదావరి ఎయిడెడ్ టీచర్సు జిల్లాగిల్డు శక్రటరీ) గారును ది 14-4-43 తేదీని తెనాలిలో జరిగిన ఫెడరేషను మహాజనసభలో వారిని కోరియున్నాము. కాని వారు అట్టిసదవకాశము కలిగించుటకు వీలులేనట్లుగా తెల్పిరి. కాన ఉపాధ్యాయులు ఆయాజిల్లాలలోని వారందఱు జిల్లాగిల్డులను త్వరలో పూర్తిచేసిన మనము రాష్ట్రీయ ఎయిడెడ్ టీచర్సు సంఘమునొకదానిని స్థాపించుటకు తగు ప్రయత్నములు జేయవచ్చును.

కనుక ఆంధ్రరాష్ట్రములోని ఎయిడెడ్ యుపాధ్యాయులందఱు ఆయాజిల్లాలలో తమసంఘమును స్థాపించి వాటినిబట్టి రాష్ట్రసంఘమును స్థాపించవలెను. దానిద్వారా ప్రభుత్వమునకు తెల్పుకొనినగాని మనకోరికలు నెరవేఱవు. లేకున్న చాలకష్టము. సంఘీభావమే బలము అనుసామెత నిత్యము పాఠ్యబోధనలో బోధించుచున్నను స్వవిషయములోమాత్రము ఆనీతిని మరచుచున్నారు. కాబట్టి త్వరలో ఉపాధ్యాయులందఱు మేలుకోవలసినదిగా హెచ్చరించడమైనది.

ఇట్లు,
జోశ్యుల సూర్యనారాయణశాస్త్రి,
ప్రెసిడెంటు,
పశ్చిమగోదావరిజిల్లా గిల్డు.

శింగవరం,
2—12—43.

---

## పద్యనీతికథావళి

కవికిశోర ఓలేటి పంచముఖేశ్వరరావు

### ౧ వ కథ : కాపువాఁడు - బాతు

ఆ. కాఁపువాఁ డొకండు కలఁడొక్కయూరిలో । వాఁడు పెంచుచుండె బాతునొకటి;
బాతు రోజు కొక్క బంగారుగ్రుడ్డును । పెట్టుచుండె కాఁపు వేడ్కపడఁగ.

ఆ. బాతు పెట్టుచున్న బంగారుగ్రుడ్లను । కాఁపుతీసికొని దుకాణమందు
అమ్మి—చాలడబ్బు నప్పుడు గడించెను । 'మోతుబరి' యటంచు పొగడ ప్రజలు.

ఆ. అంత ఒక్కనాడు అతనిపెండ్లాము । వానితోడ ఇట్లుపలికె—" మగఁడ !
బాతుకడుపు ఒక్కపర్యాయమే కోసి । పైకి తీయవయ్య పసిఁడిగ్రుడ్లు "

గీ. ఆలు చెప్పినమాటలు ఆలకించి । కాఁపువాఁడును వేగమే కత్తి తెచ్చి
బాతుకడుపును కోసెను—పసిఁడిగ్రుడ్లు । లేవు—మాంసము రక్తము, ప్రేవులుండె.
గీ. "దేవుఁడా! ఎందు కీలాగు తెలివిమాలి బాతుకడుపును కోసితి పాపినిగద
ఎంతపనిచేసితిని" అంచు ఏడ్చె నతఁడు । ఇల దురాశ దుఃఖమునకు హేతువుకద.

షరా —బాల బాలికలకు బోధపడునంతటి సులభశైలిలోఁ బద్యకథలు మన ఆంధ్రవాఙ్మయమున లేవు. పసిపిల్లలకుగూడ సులభగ్రాహ్యముగా నుండునట్లు నేను పద్యకథలను వ్రాయదలచితిని. అందుకే అచ్చటచ్చట విసంధులు గలవు. ఈ యుద్యమములో నుపాధ్యాయ సోదరులు నన్నెవ్విధంబునఁ బ్రోత్సహింతురో!

---

## పొడుపు కథలు

1. కాళ్లు లేవు—తల లేదు—బయట తిరిగివస్తాడు.
2. సూర్యునిచూడని గంగ—ఉతుకని మడుగు.
3. సూది వెళ్ళి చుక్కలను తాకింది.
4. కట్టగాని మూడుకట్టలు.
5. వంటినిండ కండ్లుగలది—వందల ప్రాణాలుతీస్తుంది.
6. అమ్మ అంటే తగులుతుంది—అయ్య అంటే తగులదు.
7. మిద్దెమీద మిరపపండు-అందఱికి కనబడుతుంది, నాకు మాత్రం కనబడదు.
8. పండుగానిపండు—పువ్వుగాని పువ్వు.
9. మాయింటిలో రెండెద్దులు—ఒకటి తిరుగుతుంది, ఒకటి తిరుగదు.
10. కూరలో పెరుగు లేదు—కాయలో నెయ్యి లేదు.

జవాబులు,—1. చొక్కా, 2. కొబ్బరినీరు, 3. తారాచువ్వ, 4. విసనకర్ర, అక్కలకర్ర, జీలకర్ర, 5. వల, 6. పెదవి, 7. ముఖమున బొట్టు, 8. విభూతిపండు-కుంకుమపువ్వు, 9. తిరుగలి, 10. పెరుగుతోటకూర, నేతిబీరకాయ.

ఇట్టి పొడుపు కథలు బాలురకెంతయు రుచించును. మఱియు వీనివలన బాలుర ఆలోచనాశక్తియుఁ బెంపొందును. వారికెంతో యుల్లాసముగూడ గలుగును. కాబట్టి యిట్టి పొడుపుకథలను ఎవరికి తెలిసినవి వారు వ్రాసి, సమాధానములనుగూడ జతపఱచి, మా పత్రికాముఖమునఁ బ్రకటింపవలసినదని మనవి. —సంపాదకుఁడు.

# నిడదవోలు

ది 23-10-43 తేదీని యీ సెంటరు క్లాసు శక్రటరీ శ్రీ. యస్. శంకరనారాయణగారు రాజీనామా యిచ్చినందున సదరుస్థానే శ్రీ. జోశ్యుల సూర్యనారాయణ మూర్తిగారినిఎన్నుకోవడమైనది.

(Sd.) S. SANKARANARAYANA,
Secretary.
23—10—43.

## ప్రాథమికోపాధ్యాయ కేంద్రసంఘము ముదినేపల్లి–కృష్ణాజిల్లా

పైసంఘ సమావేశము 27-11-43 మధ్యాహ్నము 3 గంటలకు గుడివాడరేంజి జూనియర్ డిప్యూటీ ఇనస్పెక్టరుగారగు శ్రీ. బి. డి యస్. విలియం B. A. L. T. గారి అధిపత్యమున సమావేశమాయెను.

పాట్లూరి మల్లిఖార్జునరావుగారు ప్రార్థనను జరిపిరి. యం. విశ్వేశ్వరంగారు 4 5 త. ఋతుపవనములను గూర్చి పాఠములను బోధించిరి. ప్రకాశరావుగారు, యేసుదాసుగారు పాఠశాలాలంకారమును గూర్చి గంభీరముగా ఉపన్యసించిరి.

పిమ్మట అధ్యక్షులు ప్రస్తుత యుద్ధపరిస్థితులను సింహావలోకనము గావించుచు సోవియట్ రెడార్మీ సాహసోపేత తిరిగు దాడులవల్ల ప్రపంచము ఏవిధముగా ఫాసిస్టు పాదాక్రాంతము కాకుండా నిలిచినదో వివరించుచు – మనదేశమునకు కూడ ఫాసిస్టుప్రమాదము తొలగలేదని ప్రభుత్వమునకు జపాన్‌ను ఓడించు సత్వరశక్తి కలుగవలెనంటే ప్రజలందరు ప్రభుత్వమునకు యుద్ధఋణపత్రములను కొని సాయపడవలెననియు ప్రభుత్వము విద్యాశాఖాధికారులకు – శక్త్యాశక్త్యతలను గమనించక విద్యాశాఖాధికారులు (D. E. O) తమకు సాదరు చేసిన యుద్ధ ఋణపత్రములను చలామణీ చేయవలసిన బాధ్యత తమయందున్నదనియు – అన్యప్రజానీకముతో అంతగా సంబంధము లేని తాము ఈ తాలూకాలో రూ 15000 ల ఋణపత్రములను అమ్మవలసిన బాధ్యత వున్నదనియు – జీతములోనేమి, కరువుబత్తెములలోనేమి స్వల్పాతిస్వల్పమొత్తములను స్వీకరించుచు కుటుంబభారముతో క్రుంగిపోవుచున్న సమయములో బోర్డు ఉపాధ్యాయులకు బోర్డువారు విధించు మొత్తముకు తప్పనిసరిగా ఋణపత్రములను కొనునట్లు ఉపాధ్యాయులను నిర్బంధింపవలసిన సమయము వచ్చినందున విచారహేతువుగా వున్నదని హెచ్చరించిన మీదట ప్రాథమికోపాధ్యాయులలో కొందరు ముందుకు వచ్చి వారి వారి శక్తిని బట్టి ఋణపత్రములను కొనుటకు తమ తమ అంగీకారములను వెలిబుచ్చిరి.

జి. కె. చౌదరి

గడేకల్లు:—అనంతపురంజిల్లా గుత్తితాలూకా గడేకల్లు బోర్డుహిందూ ఎడ్యుకేషన్ స్కూలునందు 27—11—43 దినము శ్రీయుత ఆర్ సి. ఓబుళరెడ్డిగారు, హెచ్. డి. ఓ. యస్. డబ్ల్యు. యఫ్. గుత్తి వీరి అధ్యక్షతక్రింద బడిపిల్లల తల్లిదండ్రాదుల విద్యాపోషక సంఘసభజరిగెను.

ప్రెసిడెంటుగారగు ఓబులరెడ్డిగారు విద్యావిషయమునుగురించి విద్యనుండి బుద్ధికుశలత, వినయము కల్గును, ద్రవ్యసంపాదనమునకు విద్యయేకారణము, చదువుకులోడు చేతిపనులుకూడ నేర్చుకొనవలెను. చదువు చేతిపని ఈరెండువిషయములపై వినుగుచెందక బాలురకు కావలసిన పరికరణములు తల్లిదండ్రాదులు సవరించుచు బాలురను శ్రద్ధగా బడికి పంపవలెననియు, విద్యలేనియెడల మనకును పశువులకును భేదమేమియు నుండదనియు, బాలికలనుకూడ బాలురతోపాటు పంపి విద్యాభివృద్ధి చేయించవలెననియు, కడుప్రయాసతో ఉపాధ్యాయులు తమగ్రామమువిడచి సర్కారువారిచ్చు జీతములుతప్ప వేరే యాదాయములు లేకున్నను మీపిల్లల విద్యాభివృద్ధికొరకు పాటుపడుటకు మీ గ్రామములకు వచ్చుదురనియు నొక్కిచెప్పిరి. ఇంత సౌకర్యము సర్కారువారు చేసిఇచ్చినను బాలురను బడికిపంపుట మనము మానుకున్నయెడల చాలా అజ్ఞానులనబడుదుము అనిచెప్పి ప్రస్తుతము యుద్ధపరిస్థితిగురించి విపులముగా చెప్పిరి. ఈబడియందు వుండుముగ్గురు

పాధ్యాయులును కష్టపడి పనిచేయుచున్నారనియు, చూచుటకింపుగొల్పుచున్న ఇటువంటిబడులకు అన్ని విధములనుండి ప్రోత్సాహము ఇచ్చుటకు తగినన్నూర్లుగావున్నది అని తెల్పివిజిట్టు పుస్తకమునందు వ్రాసిరి.

తదుపరి అసిస్టాంటు మిస్ట్రెస్ అగు పి. శిశమ్మగారు బాలికలతోపాటు మంగళముతోపూలు, పండ్లు అధ్యక్షులవారికి సమర్పించిరి. ఈసభవారందరును వాద్యవైభవములతో విద్య, యుద్ధప్రచారములు, గ్రామమందు సల్పుచు శ్రీవేములవాడ భీమలింగస్వామి ఆలయమునందు చేరిమంగళవాద్యములతో సభ సమాప్తముగావించిరి.

గడేకల్లు,
30—11—43.

యస్. యమ్. నాగలింగస్వామి,
టీచరు.

## R. C. M. Saint John's Higher Ele. School Parvatipuram.

ఈపాఠశాలయొక్క వార్షికోత్సవము ది 24-11-43 తేదీ సాయంత్రము 5 గంటలకు జరుపబడెను. ఉత్తర విశాఖపట్నంజిల్లా విద్యాశాఖాధికారియగు శ్రీ N. D. సుందర వడివేలు M.A., L.T., గారు అధ్యక్షతవహించిరి. అనేకమంది యుద్యోగస్థులు విద్యార్థులు, పోషకులు, యీసభకు హాజరైరి. ప్రధానోపాధ్యాయులవారు తమ రిపోర్టునందు పాఠశాలయొక్క దినదినాభివృద్ధినిగూర్చి ముచ్చటించిరి. పోటీపందెములందు గెలుపొందిన విద్యార్థులకు బహుమానము లొసంగబడెను. పిమ్మట ప్రధానోపాధ్యాయుల వారిచే రచింపబడిన "ప్రతిజ్ఞ" యను సాంఘికనాటకము విద్యార్థులచే నతిమనోహరముగ ప్రదర్శింపబడినది. నాటక ప్రదర్శన సమయమందే యీపాఠశాలకు సంబంధించిన జూనియరు రెడ్ క్రాసు సంఘమువారు సభ్యులవద్ద చందారూపమున రు 9-13-0 లు వసూలుచేసి సదరు పైకమును **"Relief Fund"** క్రింద జమకట్టించ గోరుచు **Madras Junior Red Cross Group Organising Secretary** గారికి మనీయార్డరుద్వారా పంపిరి. అధ్యక్షులవారు తమ అంత్యోపన్యాసమున యీజిల్లాలో వార్షికోత్సవములు జరుపుచున్న ప్రాథమికోన్నత పాఠశాల యిప్పటివరకు నిదియొక్కటియే యనియు, తదితర పాఠశాలలు దీని ననుకరించినచో బాగుగ నభివృద్ధి నొందగలవనియు, విద్యార్థుల ప్రదర్శించిన నీతిదాయకమగు యీనాటకమునందలి ప్రతివిషయమును, మనుజుడైన ప్రతివాడును తన జీవితకాలమున నెన్నడును మరువగూడదనియు, నొక్కివక్కాణించుచు, తమ యుపన్యాసమును ముగించిరి. అధ్యక్షులవారికి కృతజ్ఞతావందనము లర్పించిన పిమ్మట జాతీయగీతములతో నీసభముగిసెను.

D. BENEDICT

## Where abouts of the Ex-students not known.

Deputy Inspectors of Schools, Sub-Assistant Inspectresses of Schools, Managers of Elementary Schools under whom the following ex-students of this school happen to be working as teachers or in any other capacity are requested kindly to intimate their whereabouts to the Correspondent, C. M S. Sharkey Memorial Training School for Mistresses, Masulipatam.

| HISTORY No. | NAME | AND YEARS OF TRAINING. |
|---|---|---|
| 232 | Peterson Lucy. | 1923-25. |
| 344. | Udumula Chandrakanthamma. | 1927-29. |
| 358. | Perumallapalli Gnanakrupamma. | 1928-30. |
| 382. | Koru Pushpasaromani. | 1929-31. |

వేమూరి వెంకట కృష్ణసెట్టి అండ్ సన్సు వారి, ఎ. కణ్ణన్‌సెట్టి అండ్ కో., 288 ఎస్ప్లనేడు - మద్రాసు వారిచే ప్రచురింప బడుచుండెడి "ఆనందాశ్రమ గ్రంథ రత్నమాల" పుస్తకము లన్నిటికిని మేము సంపూర్ణ హక్కుదార్లమై యున్నాము. ఈ పుస్తకములను యితర పుస్తకములను, యీదిగువ చిరునామాకు వ్రాయవలయును. భారీగా ఆర్డరిచ్చువారికి మంచి కమీషను యివ్వబడును

ప్రస్తుత యుద్ధపరిస్థితుల ననుసరించి పుస్తకముల వెలలు స్వల్పముగా పెంచవలసివచ్చినది. గాన యెల్లరు యెప్పటివలెనే ఆర్డరు పంపుచుండగోరెదము.

## శ్రీమద్భగవద్గీతా-ప్రతిపద టీకాభాష్య విశేషార్థసహితము.

| | | | |
|---|---|---|---|
| క్యాలికో బైండు, గిల్టుపేరు గలది | 6 | 0 | 0 |
| డిటో ఆంధ్రతాత్పర్య సహితము, క్యాలికో బైండు | 1 | 8 | 0 |
| డిటో డిటో రేపర్ బైండు | 1 | 11 | 0 |
| డిటో ఆంధ్రవచనము చిన్నసైజు, క్యాలికో బైండు | 0 | 8 | 0 |
| డిటో డిటో రేపర్ బైండు | 0 | 6 | 0 |

## శ్రీ మదాంధ్రమహాభారతము

| | | | |
|---|---|---|---|
| 1 ఆది, సభాపర్వములుగలసంపుటము | 3 | 0 | 0 |
| 2 అరణ్యపర్వము | 3 | 0 | 0 |
| 3 విరాటోద్యోగ పర్వములు | 3 | 0 | 0 |
| 4 భీష్మ, ద్రోణ పర్వములు | 3 | 0 | 0 |
| 5 కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వములు | 3 | 0 | 0 |
| 6 శాంతిపర్వము | 3 | 0 | 0 |
| 7 అనుశాసనిక, అశ్వమేధ ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు గల సంపుటము | 3 | 0 | 0 |
| 1 ఆదిపంచకము- ఒకటే సంపుటము. | 7 | 8 | 0 |
| 2 యుద్ధషట్కము. డిటో | 5 | 4 | 0 |
| 3 శాంతిసప్తకము డిటో | 5 | 4 | 0 |
| భాస్కరరామాయణము | 5 | 4 | 0 |
| శ్రీకృష్ణకర్ణామృతము | 2 | 8 | 0 |
| శ్రీరామకర్ణామృతము | 2 | 0 | 0 |
| భర్తృహరిసుభాషితము | 3 | 0 | 0 |
| అమరకోశము-త్రికాండము-సటీకము క్యాలికోబైండు చేయఁబడినది. | 2 | 8 | 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము అట్టబైండు. | 0 | 10 | 0 |

## శ్రీమదాంధ్ర మహాభాగవతము
(పద్యకావ్యము-పోతనప్రణీతము)

| | | | |
|---|---|---|---|
| సంపూర్ణ ప్రతి ఒకే సంపుటము. | 8 | 0 | 0 |
| సంపూర్ణప్రతిరెండుసంపుటములుగా | 10 | 0 | 0 |
| ఒక్కొక్కవాల్యూము విడివిడిగా | 5 | 4 | 0 |
| సంపూర్ణప్రతి మూడు సంపుటములుగా | 11 | 0 | 0 |
| ఒక్కొక్కవాల్యూము విడివిడిగా | 3 | 12 | 0 |
| గజేంద్రమోక్షము క్యాలికో బైండు | 0 | 14 | 0 |
| డిటో రేపరుబైండు | 0 | 10 | 0 |
| రుక్మిణీకల్యాణము-క్యాలికోబైండు | 0 | 14 | 0 |
| డిటో రేపరుబైండు | 0 | 10 | 0 |
| నలచరిత్రము - అట్టబైండు. | 0 | 8 | 0 |
| ముకుందమాల - సటీకాతాత్పర్యము | 0 | 5 | 0 |
| ఆదిత్యహృదయము-సటీకాతాత్పర్యము | 0 | 3 | 0 |
| నీతిశాస్త్రము, సటీకాతాత్పర్యము | 0 | 3 | 0 |
| భజగోవింద శ్లోకములు టీకాతాత్పర్యసహితము. | 0 | 2 | 0 |
| శ్రీలక్ష్మీనృసింహ స్తోత్రము. టీకాతాత్పర్య సహితము | 0 | 3 | 0 |
| శ్రీ సహస్రనామ స్తబకము. క్యాలికో బైండు | 0 | 12 | 0 |
| రేపరు బైండు. | 0 | 8 | 0 |
| గోపాల సహస్రనామ స్తోత్రము | 0 | 4 | 0 |
| సప్తమస్కంధము - మూలము. | 0 | 8 | 0 |
| భోగినీ దండకము | 0 | 1 | 0 |

## రామా అండ్ కో.,

హెడ్డాఫీసు:—ఏలూరు, బ్రాంచెస్:—గుంటూరు-రాజమండ్రి.




1941 వ సంవత్సరపు నూతన సిలబసు ననుసరించి

# ప్రాథమిక భూగోళములు

శ్రీ K. వెంకట్రావు B.A., L.T., గారిచే

2 - 3 - 4 - 5 తరగతులకు

వలయువారు:— రామా అండ్ కో.,

ఏలూరు - గుంటూరు - రాజమండ్రి.